# విషయసూచిక


తొలిపలుకు

(1) అర్థమనగా నేమి?

(2) అర్థశాస్త్రమనగా నేమి?

1 వ అధ్యాయము:—నైసర్గికస్వరూపము.

(1) సాకాశ్రయములు

(2) మిట్టపల్లములు

(3) శీతోష్ణస్థితులు

(4) వర్షపాతము

(5) భూసారములు

(6) సస్యములు

(7) అటవీసంపద

(8) ఖనిజములు

(9) పశుసంపద

2 వ అధ్యాయము:—ప్రజలు.

(1) వృత్తులు

(2) జనన మరణములు

(3) మతములు

3 వ అధ్యాయము:—భూమి విధానము

(1) పద్ధతి భేదములు

(2) శాశ్వతపు టొడంబడిక పద్ధతి

(3) రయిత్వారీవిధానము

(4) పట్టాదారులు

4 వ అధ్యాయము:—వ్యవసాయము

(1) ప్రాచీనగ్రామములు

(2) పంటలు, కాయధాన్యములు

(3) పప్పుదినుసులు

(4) పండ్లు, కూరలు
(5) చెఱకు
(6) నూనెగింజలు
(7) నారవస్తువులు
(8) ఇతరవస్తువులు
(9) తక్కువ పంట
(10) వ్యవసాయాభివృద్ధి మార్గములు

5 వ అధ్యాయము:—పరిశ్రమలు.
(1) ప్రస్తుత క్షీణదశకు కారణములు
(2) పరిశ్రమలు, వానిభేదములు
(3) ఫ్యాక్టరీపరిశ్రమలు
(4) గృహపరిశ్రమలు
(5) పరిశ్రమాభివృద్ధికి మార్గములు
(6) శ్రామికులు
(7) గృహనిర్మాణము
(8) ఇతర వసతులు
(9) లేబరు సంఘములు
(10) వివాదములు

6 వ అధ్యాయము:— రహదారులు - వాణిజ్యము
(1) రైలుమార్గములు
(2) రోడ్లు
(3) నీటిమార్గములు
(4) విమానమార్గములు
(5) వాణిజ్యము
(6) ఎగుమతి వస్తువులు
(7) దిగుమతి వస్తువులు
(8) స్వదేశవాణిజ్యము

7 వ అధ్యాయము:— కరెన్సీ - బ్యాంకింగు
(1) పూర్వపు కరెన్సీ చరిత్ర
(2) బంగారుప్రమాణము
(3) బంగారుమారకపు ప్రమాణము
(4) మారకపురేటు
(5) పేపరు కరెన్సీ
(6) బ్యాంకింగు
(7) ఇంపీరియల్ బ్యాంకు
(8) రిజర్వుబ్యాంకు
(9) మారకపు బ్యాంకులు
(10) జాయింటుస్టాకు బ్యాంకులు
(11) కో ఆపరేటివ్ బ్యాంకులు
(12) వ్యక్తులైన బ్యాంకర్లు

8 వ అధ్యాయము:—ప్రభుత్వాదాయ వ్యయములు.
(1) ప్రభుత్వవ్యయము
(2) పన్నులవిధానము
(3) ప్రభుత్వఋణములు

9 వ అధ్యాయము.—ఇతర విషయములు -
(1) దేశీయాదాయము
(2) నిరుద్యోగము

# తొలి పలుకు



## అర్థమనగా నేమి?

ధర్మము, అర్థము, కామము, మోక్షము అని పురుషార్థములు నాలుగు. ఇది మన పెద్దలు చెప్పినవిషయము. మోక్షమనునది కేవలము ఆధ్యాత్మిక విషయములకు సంబంధించినది. ధర్మము ఐహికాముష్మికముల రెండింటికి సంబంధించియున్నది. అర్థకామములు ఇహలోక విషయముల నాశ్రయించియున్నవి. వీనిలో కామము అన్ననో, మానసికమైనది. అర్థము బాహ్యవిషయములకు సంబంధించినది. అర్థలాభమువలన మన కామము లీడేరును. మనకోరికలను తీర్చుకొనుటకు కావలసిన పరికరములను "అర్థము" అని అందురు. ఇవి భౌతికవస్తువులు. ఈ భౌతికవస్తువులకే అర్థము అనిపేరు. అర్థసంపాదన చేయుటకుమనుష్యులు ఏయేపద్ధతులనవలంబించుచున్నారో అట్టిపద్ధతులగూర్చి తెలుపు శాస్త్రమునకే 'అర్థశాస్త్ర'మని పేరు. ఆంగ్లమున దీనిని 'Economics' అని యందురు. అర్థవస్తువులయొక్క ఉత్పత్తి, వినియోగము, వినిమయము, విభాగము మొదలగు విషయములగూర్చి వివరించు శాస్త్రము "అర్థశాస్త్రము" అని పిలువబడును.

ఈశ్వరునిచే సృష్టింపబడిన యీ ప్రపంచములో అనేక వస్తువులుగలవు. ఆవస్తువులలో కొన్నిమాత్రమే స్వభావసిద్ధముగా అనుభవయోగ్యములు. ఉదాహరణమునకు నీరు అను పదార్థము గైకొందము. అది సహజముగనే, మనుష్యునకు

అవసరమైనవస్తువు. నీటిని త్రాగి మానవుడు దప్పితీర్చుకొనును. కొన్నివస్తువులు వాటంతటవి, మనుష్యులకు ఉపయోగకరములు కావు. వంటచేసికొనుటకు మన్ను ఉపయోగకరము గాదు. ఆ మంటిని కుండగా చేసినచో, దానిలో అన్నము వండుకొని భోజనము చేయవచ్చును. మంటిని కుండగా చేయుటకు పరిశ్రమ కావలయును. కుమ్మరివాని యొక్క పరిశ్రమతోపాటు, సారె మొదలగు నితర పరికరములు కూడ కావలయును. మట్టియు, పరికరములును, కుమ్మరివాని పరిశ్రమయును ఈ మూడును కలిసినచో కుండ తయారగును. అప్పుడది "అర్థము" అనేవస్తువు కాగలదు. నీరు, వాయువు మొదలైన కొలది పదార్థములు మాత్రమే, స్వభావసిద్ధముగా మానవునకు ఉపయోగపడునుగాని, ఇతర వస్తువులు ఉత్పత్తి కావలసియే యున్నది ఉత్పత్తిచేయుటకు, (1) భూమి మొదలైన సహజవస్తువులు, (2) మనుష్య పరిశ్రమ, (3) పరికరములు అవసరములై యున్నవి. ఈ మూడును లేకున్నచో, మనుష్యులు అనుభవించుటకు యోగ్యములైన వస్తువులు ఉత్పన్నము కాజాలవు ఇట్లు ఉత్పన్నములైన వస్తువులనే మనుష్యు లుపయోగించి అనుభవించెదరు.

## అర్థశాస్త్ర మనగానేమి

కొందరు తమకు కావలసిన, వస్తువులలో కొన్నింటిని, తామే ఉత్పత్తిచేసికొని ఉపయోగించుకొనెదరు. కుమ్మరి తన కుండను తానే నిర్మించుకొని, వినియోగించు కొనును. కుమ్మరి కానియతడు కుమ్మరిచేసిన కుండను సంపాదించి ఉపయోగించు

కొనుము. తనవద్దనున్న సొమ్మునో, లేక వేఱొక వస్తువునో కుమ్మరి వానికిచ్చి, తనకు కావలసినకుండను సంపాదించుట అనే వ్యావహారమునకు "వినిమయము" అనిపేరు. ఉత్పన్నములైన వస్తువులు కావలసినవారికి జెందుటయే "విభాగము" అని పిలువబడును రైతు ధాన్యమునుపండించును. ఆ ధాన్యము బియ్యము రూపముగా మాఱును. ఆ బియ్యమును మనుష్యులు సంపాదించి వండుకొని భోజనముచేసి, తమ ఆకలిని బాపుకొనుచున్నారు. భూమిని రైతు సాగుచేసి ధాన్యము పండించునది మొదలుకొని, ప్రజలు అన్నమును తినువరకును, జరిగే వ్యవహారములవంటి సమస్త వ్యవహారములయొక్క స్వభావస్వరూపములలో గోచరమయ్యే ప్రధాన సూత్రములు నిర్వచించుటయే, "అర్థశాస్త్రము" యొక్క పనియై యున్నది.

తినుటకు అన్నము, కట్టుటకుబట్ట, నివసించుటకు యిల్లు, మొదలగు అనేక పదార్థములు మనుష్యులకు అవసరములై యున్నవి. ఇటులనే అజ్ఞానమును బాపుటకు విద్య, గ్రంథములు మొదలగునవియు; రోగములు లేకుండుటకు పారిశుద్ధ్యము, ఔషధములు మొదలగునవియు వాంఛనీయములు. ఇట్టి వస్తువులయొక్క ఉత్పత్తి, వినిమయము, విభాగము, వినియోగమును గూర్చి చర్చించు శాస్త్రమునకే "అర్థశాస్త్రము" అనిపేరు.

అర్థశాస్త్రగ్రంథములలో నిర్వచింపబడెడు సూత్రముల యొక్క విచారణ యీ గ్రంథము యొక్క యుద్దేశము కాదు. మన భారతావనియొక్క అర్థసంపదలను గూర్చిన విషయముల తెల్పుటయే ఈ గ్రంథముయొక్క తాత్పర్యము. ఆర్థిక విషయ

ములబట్టిచూచినచో, మన దేశము మిక్కిలి వెనుకబడియున్నది. ఆర్థికముగా ప్రస్తుతము మన దేశ మెట్టి స్థితిలోనున్నదియు; భాగ్యవంతముగా జేయుటకు ఎట్టి అవకాశములున్నవి; అనే విషయమును తెలిసికొనుటకు యీ గ్రంథము ఉపకరించగలదు. భారత దేశముయొక్క నైసర్గికస్వరూపమును గూర్చి మొదటి అధ్యాయమునందును, ప్రజలను గూర్చి రెండవ యధ్యాయము నందును, భూమి విధానము గూర్చి మూడవ అధ్యాయము నందును, వ్యవసాయమును గూర్చి నాల్గవ అధ్యాయము నందును, పరిశ్రమలను గూర్చి అయిదవ అధ్యాయమునందును, రహదారులు వాణిజ్యమును గూర్చి ఆరవ అధ్యాయము నందును, కరెన్సీ బ్యాంకింగులనుగూర్చి యేడవ అధ్యాయము నందును, ప్రభుత్వ ఆదాయవ్యయముల గూర్చి యెనిదవ అధ్యాయమునందును, తదితర విషయముల గూర్చి తొమ్మిదవ అధ్యాయమునందును, స్థాలీపులాకన్యాయముగా, యీ గ్రంథమున వివరింప దలచినాను.

---

# భారతదేశము - ఆర్థికవ్యవహారాలు

## 1 వ అధ్యాయము



### నైసర్గిక స్వరూపము

మద్రాసు, బొంబాయి, బెంగాలు, మధ్యపరగణాలు, సంయుక్త పరగణాలు, ఒరిస్సా, సింధు, పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతములు, పంజాబు, బీహారు, అస్సాము, అను పదునొకండు రాష్ట్రములును; ఢిల్లీ, అజ్మీర్ మార్వారా, బెలూచిస్థానము, కూర్గు అనే భాగములును; హైదరాబాదు, మైసూరు మొదలగు 562 స్వదేశ సంస్థానములును కూడిన దేశమునకు భారతదేశమని పేరు. దీనివైశాల్యము 15,70000 లక్షల చతురపు మైళ్లు. ఉత్తరమునుండి దక్షిణమునకు రెండువేలమైళ్లును తూర్పునుండి పడమరకు రెండువేల ఒక నూరుమైళ్లును, పొడవు గలిగియున్నది. దీనికుత్తరభాగమునను, ప్రక్కలను నాలుగు వేల ఆరువందలమైళ్ళ నిడివిగల భూప్రదేశమును, మిగిలిన వైపుల నాల్గువేల మూడువందల మైళ్ళు పొడవుగల సముద్రతీరమును సరిహద్దులైయున్నవి. ఉత్తరమందు హిమాలయ పర్వతశ్రేణులు పెట్టనికోటలై యున్నవి. పశ్చిమోత్తర భాగమున నీశ్రేణులయందు కైబరు, బొలాన్ కనుమలుగుండా ద్వారములు కలవు. పశ్చిమమున అరేబియా సముద్రమును, దక్షిణమున హిందూమహాసముద్రమును, తూర్పున బంగాళాఖాతమును గొప్ప పరిఘలైయున్నవి. అందువలన భారత దేశము శత్రుదండయాత్రలకు దుర్గమము.

## నౌ కా శ్ర యము లు

అంతేగాక ఆసియా, ఐరోపాఖండ దేశములమధ్య గొప్ప కీలక స్థానమును ఆక్రమించియున్నది. వర్తక వాణిజ్యములకు గాని, ప్రపంచ రక్షణావసరములకుగాని, మన దేశము మంచి కూడలి. గొప్ప నౌకాపరిశ్రమకు వెక్కు అవకాశములున్నవి. కరాచీ, బొంబాయి, కొచ్చిన్, గోవా, విశాఖపట్టణము మొదలగు సహజసిద్ధములైన నౌకాశ్రయములు కలవు. ప్రభుత్వమువారిచేత నిర్మింపబడిన మద్రాసు, కలకత్తా మొదలగు నౌకాశ్రయములున్ను కలవు. నిర్మించుటకు ఉపయుక్తములైన నౌకాశ్రయస్థానములు యింకెన్నియో కలవు.

## మి ట్ట ప ల్ల ము లు

మిట్టపల్లములను బట్టి మన దేశమును మూడు ఖండములుగా విభజించవచ్చును (1) హిమాలయపర్వత సీమ:— ఈ పర్వతములు ప్రపంచములోనికెల్ల ఎత్తైనవి. వాటిపొడవు 1250 మైళ్లు. కుమారసంభవ గ్రంథమున కాళిదాస మహాకవి వర్ణించినట్లు, భూమిని కొలుచుటకు పరమేశ్వరుడు నిర్మించిన కొలత కఱ్ఱవలెనున్నవి. ఈ పర్వతపంక్తిలో జన్మించిన గంగా సింధు మొదలైన నదులయందు నీరు సర్వదాప్రవహించును. కొండలయందలి మంచుకఱిగి, యీ నదులయందు ప్రవహించుట చేత యీనదులకు ఎండుట అనునది లేదు. ఉత్తరదిశనుండి చలిగాడ్పులు రాకుండ యీ కొండలు అడ్డగించి, మన దేశము యొక్క శీతోష్ణస్థితిని చక్కబరచుచున్నవి.

(2) ఉత్తరహిందూస్థానము:— ఉత్తరమున హిమాలయ

శ్రేణులు మొదలుకొని, దక్షిణమున వింధ్యా, సాత్పూరా పర్వత ప్రాంతములవరకు గల భాగమును ఉత్తరహిందూస్థాన మందురు. ఇది చాలా ఫలవంతమైన ప్రదేశము. గంగా సింధూ నదీజలములచే పునీతమైనది. మిట్టపల్లములు విశేషముగా లేక, సమభూమిగానున్నది నదీ జలములచే నేర్పడిన ఒండ్రుమట్టి వలన భూమి ఫలవంతమై, సస్యశ్యామలమై విలసిల్లుచున్నది. దీనిని ఆర్యావర్తమని కూడా యందురు. ప్రాచీనార్య నాగరికతకు యిది నివాసభూమి. శీతోష్ణస్థితి చక్కగానుండును.

(3) దక్షిణహిందూస్థానము:-దీనిని దక్కను పీఠభూమి యని యందురు. వింధ్యసాత్పూరా పర్వతములకు దక్షిణము నుండి, కన్యాకుమారి అగ్రము వరకు గల భాగమునకు దక్షిణ హిందూస్థానము అనిపేరు. పశ్చిమమున పడమటి కనుమల చేతను, తూర్పున తూర్పుకనుమలచేతను యీ ప్రదేశము సంరక్షింపబడుచున్నది. ఉత్తరహిందూస్థానమువలె సమప్రదేశము కాదు. మిట్టపల్లములుగా నుండును. నర్మద, తపతి, మహా నది, గోదావరి, కృష్ణ, కావేరి యీ ప్రదేశమునందు ముఖ్యమైన నదులు. గంగా సింధు నదులయందువలె వీనిలోనీరు సార్వకాలికముగా ప్రవహించదు. గ్రీష్మకాలము నందు యీ నదులు ఎండిపోవును. ఈ నదీజలములచేత సిక్తములగు ప్రాంతములు సస్యములచే విరాజిల్లుచున్నవి.

## శీతోష్ణస్థితి

ఉష్ణము, శీతము, సమశీతోష్ణము అని ప్రపంచములో శీతోష్ణస్థితి మూడు విధములుగా నున్నది. భారతదేశ దక్షిణ

భాగమున ఉష్ణస్థితియును, ఉత్తర భాగమున సమశీతోష్ణస్థితియున్న ఏర్పడి యున్నది. ఈ ప్రదేశముల యందు, ఋతువులను బట్టి శీతోష్ణములు పరివర్తనము జెందుచుండును. కాని ఉత్తరధ్రువప్రాంతమునం దుండెడి శీతస్థితిగాని, భూమధ్యరేఖ వద్దనుండెడి ఉష్ణస్థితిగాని మన దేశమున గానరావు అయితే, ఉత్తర హిందూస్థానమునందు చలికాలమున మిక్కిలి చలియు, ఎండకాలమున మిక్కుటముగా ఎండలున్న సంభవించును. ఋతు ధర్మముల బట్టి శీతోష్ణస్థితులు మారుచుండును. చైత్ర వైశాఖ మాసములు వసంతఋతువనియు, జ్యేష్ఠ ఆషాఢములు గ్రీష్మఋతువనియు, శ్రావణ భాద్రపదములు వర్షఋతువనియు, ఆశ్వయుజ కార్తికములు శరదృతువనియు, మార్గశిర పుష్యములు హేమంత ఋతువనియు, మాఘఫాల్గుణములు శిశిర ఋతువనియు చిన్నతనమున మనము చదివియే యున్నాము. ఈ ఋతువులే దేశ శీతోష్ణస్థితి యొక్క కాలమానములను తెలియజేయును.

## వర్షపాతము

ఈశాన్య ఋతుపవనము, నైఋతి ఋతుపవనము అని రెండు ఋతుపవనములు గలవు ఈ ఋతుపవనముల బట్టియే వర్షములు కురియును. ఎండకాలములో సముద్రజలము కంటె, భూమి తొందరగా వేడి ఎక్కును. ఎండలు తగ్గిన వెంటనే సముద్రము మీదనుండి చల్లగాలి భూమిమీదికి వీచుటవల్ల వానలు కురియును. ఆషాఢ మాసమునుండి కార్తీక మాసము వరకు కురిసే వర్షములు యీ గాలివలన

నేర్పడును. వీనినే నైఋతి ఋతుపవనములందురు. ఈ వర్షములే ప్రధానములు మనదేశము మొత్తముమీద కురిసే వర్షపాతములో నూటికి తొంబదివంతులు యీ నైఋతి ఋతుపవనముల వలన నేర్పడు చున్నవి. పడమటి కనుమల వద్దను, హిమాలయ పర్వతముల వద్దను ఈ వర్షములు విశేషముగా కురియును.

చలికాలము వచ్చుసరికి, సముద్రజలముకంటె భూమి తొందరగా చల్లబడును ఆకారణమున భూభాగమునుండి చలిగాడ్పులు సముద్రముపై పునః ప్రసరించుటచేత, వర్షములు సంభవించును. ఈవర్షములు ఈశాన్యఋతుపవనములవలన ఏర్పడినవని చెప్పబడుచున్నవి. నూటకి పదివంతులుమాత్రమే ఈపవనములవలన, వర్షపాతము కలుగుచున్నది మద్రాసు, పంజాబు రాష్ట్రములందు ఈవర్షములు ఎక్కువగా కురియును.

భారతదేశ సస్యాభివృద్ధికి, ఈవర్షపాతములే ఆధారములు. ఈవర్షములు కురియకున్నచో సస్యములు ఫలించక క్షామములు సంభవించును. వీనిని ఆధారముగా చేసికొనియే పైరులు నాటబడును. వరి, ప్రత్తి మొదలగుపైరులు జూను ప్రాంతములయందు నాటబడును. గోధుమ మొదలగు పైరులను సెప్టెంబరు, అక్టోబరు ఆప్రాంతములయందు నాటుదురు. ఈవానలు సరిగా సకాలమునకు కురిసినచో, దేశము సస్యసమృద్ధమై విరాజిల్లును.

## భూ సా ర ము లు

భూగర్భశాస్త్రజ్ఞులు మనదేశములోని భూమిని పరీక్షించి మూడువిధములుగా విభాగము చేసియున్నారు. (1) రేవడ

భూమి, (2) నల్లభూమి (3) గడ్డభూమి. (1) మనదేశములో రేవడభూమియే విశేషముగా నున్నది. నదీజలములచేత సిక్తములైన ప్రదేశములయందు యీ రేవడభూమియే కానవగును. సింధు, గుజరాతు, పంజాబు, సంయుక్తపరగణాలు, బెంగాలు కృష్ణా గోదావరీ కావేరీ తీరములయందు యీ భూమియే కానవచ్చును ఈవిధమైన భూమి చాల సారవంతముగా నుండును. అనేక సస్యములు యిక్కడ సమృద్ధిగా ఫలించును. (2) బొంబాయి, మధ్య పరగణాలు, హైదరాబాదు రాష్ట్రముల యందు నల్లభూమి విశేషముగాగలదు. ప్రత్తి జొన్న మొదలగు పైరులకు యీ భూమి చాలా శ్రేష్ఠము. కర్ణాటక, గుజరాతు దేశములందును, మద్రాసురాష్ట్రములో కొన్ని జిల్లాలయందును, యీరకమైనభూమి కానవచ్చును. గోధుమలు పప్పువస్తువులు అవిసెగింజలు మొదలైన పంటలకు యీ భూమి నాణ్యమని చెప్పుదురు.

(3) మిగతా మద్రాసు రాష్ట్రమందును, మైసూరు సంస్థానమందును, బొంబాయి, హైదరాబాదు, మధ్యరాష్ట్రములో కొన్ని ప్రాంతములందును గడ్డభూమిగలదు. ఈ రకపు భూమి పైభూములంతసారవంతము గాకపోయినను, వరి మొదలగు ధాన్యములకు అనుకూలముగానే యుండును.

## సస్యములు

వరి, గోధుమ, జొన్న, రాగి, చోడి, మొక్కజొన్న, బార్లీ, పప్పుపదార్థములు మొదలగు ఆహారపదార్థములున్ను; వేరుశనగ, ఆముదము, అవిసె, నువ్వు మొదలగునూనె గింజ

లున్ను; పత్తి, జనపనార మొదలగు నారవస్తువులున్ను; చెఱకు, కాఫీ, తేయాకు మొదలగు పానీయములకు ఉపయోగించే వస్తువులున్ను; మిరియాలు, దాసెవచెక్క, పోక, లవంగము, రబ్బరు, నల్లమందు మొదలగు ఇతర వస్తువులున్ను మన దేశమున ఫలించే సస్యములు అయివున్నవి. బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రములందును; మద్రాసు, బొంబాయి, రాష్ట్రములలో కొంతప్రదేశమందును వరిధాన్యముపండును. ఉత్తరహిందూస్థానములో వాయువ్యభాగమందు గోధుమలు పండును. మొక్కజొన్న, జొన్న, చోడి, రాగి మొదలగు యితర కాయధాన్యములు మద్రాసు, బొంబాయి, బీహారు, సంయుక్తపరగణాలు, ఒరిస్సారాష్ట్రములందును, పప్పాదినుసులు (అనగా కంది, పెసర, మినుము, మొదలైనవి) పంజాబు, సంయుక్తరాష్ట్రములు, బీహారు, మధ్యపరగణాలు, ఒరిస్సాప్రాంతములయందును ఫలించును. బెంగాలు, అస్సాము రాష్ట్రములయందు తేయాకున్ను; మద్రాసు,కూర్గు ప్రాంతములకాఫీయున్ను పండును. చెఱకుపంట పలుచోట్ల కలదు; గాని ముఖ్యముగా సంయుక్తపరగణాలయందు కానవగును.

ప్రత్తిపంట, బొంబాయి, మధ్యపరగణాలు, మద్రాసు రాష్ట్రములందును; జనపనార బెంగాలునందును పండును. నూనెగింజలు మధ్యపరగణాలు, సంయుక్తపరగణాలు, బొంబాయి; మద్రాసు రాష్ట్రములయందు ఫలించును. రబ్బరు పంట అస్సామునందును, పొగాకుపంట; మద్రాసు, బొంబాయి, బీహారు, బెంగాలు రాష్ట్రములందును పండును.

## అ ట వీ సం ప ద

మన దేశమున అటవీసంపద బాగుగాకలదు. అస్సాము రాష్ట్రములో మిక్కుటముగాను; మధ్యపరగణాలు, బొంబాయి మదాసు, బెంగాలు రాష్ట్రములయందు కొంతవఱకును ఈ సంపదగలదు. దీనివలన గృహనిర్మాణమునకు కావలసిన కలప యును, వంటచెఱకును, లక్క మొదలగు యితర వస్తువు లన్నియు లభించును.

## ఖ ని జ ము లు

మన దేశమున దొరకు ఖనిజములలో బొగ్గు, యినుము, మంగనము, ఉప్పు, సీసము, బంగారము, వెండి, తుత్తు నాగము, అభ్రికము మొదలగునవి ముఖ్యమైనవి యుద్ధము నకు పూర్వమున్న ధరలనుబట్టి సంవత్సరమునకు షుమారు 35 కోట్ల రూపాయల విలువగల ఖనిజములు మన దేశములో ఉత్పత్తియగుచున్నట్లు అంచనా వేయబడినది.

## ప శు సం ప ద

వ్యావసాయిక దేశమైన భారతదేశమునకు పశుసంపద చాలా ముఖ్యమైనది. మన దేశమున మనుష్యులకు అవసరము లైనట్టి అనేకవిధములైన పశువులుకలవు. పాలిచ్చుటకు ఆవులు, గేదెలుఉన్నవి. పొలము దున్నుటకు ఎద్దులు దున్నలు కలవు. ఉన్నినిచ్చుటకు గొఱ్ఱెలున్ను; పొలములలో పెంటకట్టుటకు మేకలు, గొఱ్ఱెలున్ను; భారమును మోయుటకు గుఱ్ఱములు, గాడిదలు, లొట్టిపిట్టలు, ఏనుగులున్ను; ఆహారమునకు మత్స్య ములు, పక్షులు యితర జంతువులున్నుకలవు. దేశసౌభాగ్యము కొరకు ఈసంపదనుకాపాడి, పోషించిఅభివృద్ధిచేయవలసియున్నది.

# 2 వ అధ్యాయము



## ప్రజలు

ప్రపంచ ప్రజాసమూహములో షుమారు 5-వ వంతు ప్రజలు మన దేశములో నివసించుచున్నారు. చీనాదేశము తరువాత, భారతదేశమునందే ఎక్కువ ప్రజాసముదాయము కలదు. 1941 సం॥ జనాభా లెక్కలనుబట్టి చూచిన యెడల, మన దేశములోని మొత్తము జనాభా సంఖ్య 388,800,000 అయియున్నది. సారవంతములైన భూములుగల ప్రదేశముల యందు ప్రజలు ఎక్కువదట్టముగా నివసించుచున్నారు. బెంగాలు, సంయుక్త పరగణాలు మొదలగు రాష్ట్రముల యందు ఎక్కువసమ్మర్దముగాను, బెలూచిస్థానము మొదలగు ఎడారి ప్రదేశములయందు తక్కువ సమ్మర్దముగాను ప్రజలు నివసించుచున్నారు. అట్లు నివసించుట స్వాభావికమే కదా?

## వృత్తులు

మన దేశములోని ముఖ్యమైన వృత్తి వ్యవసాయము. నూటికి డెబ్బదిమంది వ్యవసాయము మీద ఆధారపడి జీవించుచున్నారు. నూటికి పదిమంది పరిశ్రమలవల్లను, మిగిలినవారు వాణిజ్యము, ఉద్యోగము మొదలైనవానివల్లను, జీవయాత్ర గడపుచున్నారు. వ్యవసాయమే ప్రధానవృత్తియగుటవలన ప్రజలు విశేషముగా గ్రామసీమలయందే నివసించుచున్నారు. నూటికి పదునొకండుగురు మాత్రమే పట్టణవాసులు. మన దేశములో

షుమారు 7 లక్షల గ్రామములున్ను; 2500 పట్టణములున్ను కలవు. ఇంగ్లాండు వంటి పారిశ్రామిక దేశములలో నూటికి ఎనభైమంది పట్టణవాసులై యున్నారు. భారీపరిశ్రమలు అభివృద్ధియగుచో, పట్టణములయందలి జనభా పెరుగును.

## జనన మరణములు

ఇతర దేశములతో పోల్చినయెడల జనన మరణముల సంఖ్య మనదేశములో హెచ్చుగానున్నది. ప్రతిసంవత్సరము వెయ్యికి ముప్పదిఅయిదు చొప్పున జననములున్ను; ఇరువది అయిదు చొప్పున మరణములున్ను సంభవించుచున్నవి. ఇతర దేశములలో ఈ సంఖ్యలు ఇంతకంటె చాలా తక్కువగా నున్నవి. మరణసంఖ్య హెచ్చుగానుండుట శోచనీయము. ఇందుకు అనేక కారణములు కలవు. దారిద్ర్యము, అజ్ఞానము, తగిన వైద్య సహాయము లేకుండుట, పారిశుద్ధ్యము లేకుండుట మొదలగువాని వలన ఈ పరిస్థితులేర్పడుచున్నవి. పైకారణముల వలన మరణము లెక్కువగుటయేగాక, మనుష్యులశక్తి సామర్థ్యములుకూడ క్షీణించిపోవుచున్నవి. తగినంత బలము గాని, శక్తిగాని, ఉత్సాహముగానిలేక, చేయదగినంత వస్తూత్పత్తిని చేయజాలకున్నారు.

1931 సంవత్సరమునుండి, 1940 సం॥ లోపల అనగా పదిసంవత్సరములలో 5 కోట్ల జనాభా పెరిగినది. ఈ విధముగా జనాభా పెరుగుట దేశమునకు క్షేమదాయకముగాదనియు, ఈ పెరుగుదలకు చాలినంత వస్తుసంపద ఉత్పత్తియగుట కష్టమనియు; అందువలన జనాభాసంఖ్య విశేషముగా

పెరుగకుండా ఉండే పరిస్థితులను, కల్పించుట అవసరమనియు కొందరు వాదించుచున్నారు. బాల్యవివాహములు యీ పెరుగుదలకు ఒక ముఖ్యకారణమనికూడ, వారు తెలుపుచున్నారు.

పై కారణములు సహేతుకములైనను, కాకున్నను పెరుగుచున్న జనసంఖ్యయొక్క పోషణకొరకు ఆర్థికాభివృద్ధి మిక్కిలి యవసరమని వేఱ చెప్పనవసరము లేదు. ఇప్పుడు మన దేశములో ఉత్పత్తియగుచున్న ఆహారపదార్థములు అందరికి చాలుట లేదు. విదేశములనుండి దిగుమతులు వచ్చుచుండుట చేత, యుద్ధకాలమువరకు ఏదోవిధముగా అందరికి ఆహారము లభించుచూ వచ్చినది. ఆహారపదార్థములను, మన దేశమునకు దిగుమతిచేసే బర్మా మొదలగు దేశములు, జపానువారి చేతులలో చిక్కినతరువాత, దిగుమతులు అంతరించెను. మన దేశపు పంట చాలకపోయెను. అందువలన క్షామపరిస్థితులు యేర్పడి లక్షలకొలది ప్రజలు అన్నములేక,కృశించి మరణించిరి. కావున ఏటేట అభివృద్ధి నొందుచున్న జనసంఖ్యనుపోషించుటకు, ఆర్థికాభ్యుదయమెంతయు అవసరము.

జననములసంఖ్య తగ్గించుటకు అవినీతికరములైన సంతాన నిరోధక పద్ధతులను కొందరు అవలంబించుచున్నారు. అట్టిది యెంతమాత్రమును వాంఛనీయముకాదు. గాంధీమహాత్ముడు ఆపద్ధతులను తీవ్రముగా నిరసించియున్నాడు. అస్వాభావికములైన, సంతాన నిరోధకపద్ధతులు మన భారత సంప్రదాయమునకు, మిక్కిలి విరుద్ధములు. సంతాన నిరోధము అవ

సరమే యగుచో, మనపూర్వులు అవలంబించినపద్ధతులు మాత్రమే పరిగ్రాహ్యములు.

## మ త ము లు

అనేక మతములు మన దేశములో వెలసినవి. అనాది మతము హిందూమతము. వేదకాలమునాటినుండియు వృద్ధి బొంది, మానవ కళ్యాణమునకు ఎంతయో దోహదమొసంగినది. హిందూమతమునందు కూడ, అవాంతర మతములెన్నియో కలవు. అయినను వేదప్రామాణ్యము, పునర్జన్మ సిద్ధాంతము భగవంతుని ఉనికి, శరీరముకంటె భిన్నమైన ఆత్మయొక్క స్థితి మొదలైనవి హిందూమతమందలి ప్రధాన లక్షణములు. హిందూమతమేకాక బౌద్ధ, జైన, మహమ్మదీయ, క్రైస్తవ, సిక్కు, పారశీక మతములుకూడా మన దేశమున విరాజిల్లు చున్నవి. ఇన్నిమతములు ఒకేప్రదేశమునందుండుటకు, భారతీయులయొక్క సహనశీలతయే ప్రధానకారణము. కాని బ్రిటిషుసామ్రాజ్యము మన భూమియందు స్థాపితమైన నాట నుండియు, మతకలహములు విజృంభింపసాగెను. ఒక మతము వారికి అన్యమతస్థులయందు ద్వేషభావము బొడసూపెను. "విభజించి పాలించు" అనే రాజకీయ న్యాయము ననుసరించి మన పరిపాలకులైన బ్రిటిషువారు యీమతస్థులమధ్య, ద్వేషాగ్నిని ప్రజ్వలింపజేసిరి. పరస్పరవైరుధ్యములు ఉన్ననేకాని, వారి రాజ్యమిక్కడను స్థిరము కాజాలదు. నేటికిని మతవిద్వేష శక్తులు తాండవమాడుచునేయున్నవి. లోకోత్తర పురుషుడగు గాంధీమహాత్ముని బోధనవలన,కొంతమార్పు కలిగినను,స్వరాజ్య ప్రాప్త్యనంతరము కొన్నిసంవత్సరములవరకు, యీదుష్టాగ్ని

రాజుచునే యుండునని అనుకొనకతప్పదు. రాజకీయాభివృద్ధికే గాక, ఆర్థికాభివృద్ధికిగూడ యీమతవిద్వేషశక్తులు ప్రతిబంధకములు. ఈశక్తులెంతత్వరలో నశించినయెడల దేశమునకంత మేలు చేకూరగలదు.

# 3 వ అధ్యాయము

## భూమి విధానము

భారతదేశములో ప్రధానసంపద భూసంపదయనియు, నూటికి డెబ్బదిమంది వ్యవసాయము నాధారముగా జేసికొని జీవించుచున్నారనియు, ఎల్లరెఱింగిన విషయమే. భూమి రాజునకు చెందునా? లేక రైతునకు చెందునా? అనునది మన దేశమున నొక పెద్దసమస్యగా నుండెడిది. భూమి రాజునకే చెందియున్నచో, రాజు యిష్టముమీాదనే రయితు వ్యవసాయము చేయవలసి యుండును. లేక, భూమి రయితునకే చెందియున్నచో, న్యాయమైన పన్ను వసూలుచేసికొనుటకు మాత్రమే రాజునకు హక్కు ఉండును. కాని తన యిష్టము వచ్చినట్లు, రయితుమీాద అధికారమును చలాయించుటకు వీలుండదు. ఈ సమస్యను ఉన్నత న్యాయస్థానములు విమర్శించి భూమియందలి హక్కు రయితునకే చెందునని, నిర్ణయించియున్నవి. ప్రజాక్షేమముకొరకున్ను, ప్రజాసౌఖ్యము కొరకున్ను, శాంతిభద్రతల కాపాడుట కొరకున్ను, రాజు పన్నులను విధించి వసూలు చేయవలసి యున్నది. అట్లుపన్ను

విధించే యధికారము మాత్రము రాజునకు కలదు. భూమి యందు రయితునకుగల హక్కులయొక్క స్వభావస్వరూపము లెట్టివి? వానిలో ఎన్ని విభేదములు కలవు? అను విషయము విచారణీయము. గ్రంథవిస్తరభీతివలన పూర్వచరిత్రము పరామర్శించక, బ్రిటిషు పరిపాలనా కాలములో నున్న ముఖ్యపద్ధతులగూర్చి క్లుప్తముగా వివరించుచున్నాను.

## పద్ధతి భేదములు

ఇందులో రెండు ప్రధాన పద్ధతులుకలవు. 1. జమీందారీపద్ధతి 2 రయిత్వారీ పద్ధతి. బ్రిటిషువారు మన దేశము నాక్రమించుకొన్న తరువాత, భూమి పన్నులను వసూలు చేయవలసి వచ్చినది. వారీ దేశమునకు క్రొత్తవారు. దేశ భాషలుగాని, మర్యాదలుగాని, ఆచారములుగాని వారికి తెలియవు. అందువలన, అక్కడక్కడ కొందరు పెత్తనదారులను లేవదీసి, కొన్ని గ్రామములను కలిపి, వారికి యిజారా యిచ్చి, ఏటేట వారు తమకు కొంతనిర్ణీతమైన పైకమును చెల్లించునట్లును, సాగుచేసిన రయితుల వద్దనుండి తమయిష్ట ప్రకారం వారు శిస్తులు వసూలుచేసి కొనేటట్లున్నూ ఏర్పాటు చేసిరి. ప్రభుత్వమునకున్ను, రయితునకున్ను, ఎట్టిప్రత్యక్ష సంబంధమున్ను లేదు. రయితులవద్దనుండి శిస్తు వసూలుచేసే యధికారము ఈ పెత్తనదారులకు చెందియుండెను. ఒడంబడిక ప్రకారము తామునిర్ణయించుకొన్న పైకమునుప్రభుత్వము వారి కిచ్చేబాధ్యత మాత్రము యీ పెత్తనదారుల కుండెను. దీనివలన తమకు కష్టము లేకుండా పన్ను వసూలగుటయు,

తమకు విశ్వాసపాత్రులగు ఒక వర్గమేర్పడుటయు, ప్రభుత్వమునకు సంభవించెను. ఇట్లు కొంతకాలము జరుగుచు రాగా ఈ పెత్తనదారులు రయితులను నిర్బంధించి, హెచ్చుశిస్తులు వసూలుచేసి, రయితుల యొక్క అజ్ఞానస్థితిని అండగాగొని, అనేకవిధములైన లాభములను వారివలన పొందుచువచ్చిరి. ఈ పద్ధతివలన, ప్రభుత్వమునకు రాదగిన ఆదాయమును ఈ పెత్తనదారులు అపహరించుటయే గాక, వారు రయితులను పెట్టే బాధలనుచూచి, క్రీస్తు వెనుక 1802 సంవత్సరమునందు, 'శాశ్వతపు టొడంబడిక పద్ధతి' అను నొక పద్ధతిని నెలకొల్పిరి.

## శాశ్వతపు టొడంబడిక పద్ధతి

ఈపద్ధతివలన సిద్ధించినదేమనగా, సార్వకాలికముగా అనగా మార్పులు లేకుండా, పెత్తనదారులు ప్రతిసాలునా ఒక నిర్ణీతమైన మొత్తమును, 'పేష్కష్' అనుపేరుతో ప్రభుత్వమునకు చెల్లించుటకున్నూ, పెత్తనదారులు రయితులవద్ద నుండికూడ, నిర్ణీతమైన మొత్తమును శిస్తులక్రింద స్వీకరించుటకున్నూ ఏర్పాటులు చేయబడెను. దీనిచే శాశ్వతపుటొడంబడిక పద్ధతియనియందురు. ఈపెత్తనదారులనే జమీందారులందురు. అనేకచోట్ల ఈపద్ధతి అమలుపరచబడినదిగాని, కొన్నిచోట్ల శాశ్వతములైన యేర్పాట్లు లేకుండా, తత్కాలమునకు మాత్రమే పెత్తనదారులు ఏర్పాటు కావింపబడిరి. దీనినే 'తత్కాలపుటొడంబడిక' విధానమందురు.

"శాశ్వతపుటొడంబడిక విధాన"మనునది బెంగాలు, బీహారు రాష్ట్రములయందు విశేషముగాను, సంయుక్తపర

గణాలు, ఒరిస్సా, అస్సాము, మద్రాసు రాష్ట్రములలో కొన్ని భాగములయందును కలదు. తత్కాలవు టొడంబడిక విధాన మనునది సంయుక్త పరగణాలు, మధ్యపరగణాల రాష్ట్రము లలో విశేషముగాను ఇతరప్రదేశములలో కొంచెముగాను కాన నగును. మొదటిదానియందు శాశ్వతముగాను, రెండవదాని యందు తాత్కాలికముగాను ప్రభుత్వమునకును, పెత్తన దారులకును మధ్య ఏర్పాట్లు జరిగియుండుటయే ఈరెండు విధా నములకును గల ముఖ్యతారతమ్యము.

## రయిత్వారీ విధానము

పైనచెప్పబడిన రెండువిధానము లున్న ప్రదేశములు గాక, దాదాపు మిగతా దేశమందంతటను రయిత్వారీ విధా నమే అమలులో నున్నది. ఇ వ్విధానమునందు రయితునకును ప్రభుత్వమునకున్ను మధ్య పెత్తనదారులు లేరు. వారిరువురి మధ్య ప్రత్యక్షమైనట్టియు, సన్నిహితమైనట్టియు సంబంధము కలదు. సరాసరిగా, రయితువద్దనుంచియే ప్రభుత్వము పన్ను లను వసూలుచేయును. పన్నులను హెచ్చించుటకుగాని, తగ్గించుటకుగాని ప్రభుత్వమునకుమాత్రమే అధికారము కలదు. భూమిని సేద్యముచేసి, అనుభవించెడు హక్కు రయితునకే కలదు. పన్నులు చెల్లించక, అక్రమముగా బకాయిపెట్టెయెడల రయితుపై చర్యజరిపి, అవసరమైతే, భూమిని వేలమువేయించి అమ్మించుటకు ప్రభుత్వమునకు అధికారమున్నది. ఈ పద్ధతికే "రయిత్వారీ విధాన"మని పేరు.

## పట్టాదారులు

ఇప్పటి కమలులోనున్నలా ప్రకారము జమీందారులతోగాని, ప్రభుత్వముతోగాని సాక్షాత్తుగా సంబంధము కలిగిన రయితులు తమ భూములను ఇతరులకు కవులు యివ్వవచ్చును. కవులునకు పుచ్చుకున్నవారికి కవులుషరతుల బట్టి సంక్రమించే హక్కుతప్ప, యితరహక్కు లుండనేరవు. భూమియందలి హక్కులన్నియు కవులుకు యిచ్చిన ఆసామీయందే వుండును. ఈ ఆసామీలను పట్టాదారులందురు. పట్టాదారులు తాము, తమ భూమిని స్వయముగా సేద్యముచేసికొనవచ్చును; లేదా, సాగునిమిత్తము ఇతరలకు కవులునకు యివ్వవచ్చును. కవులునకు తీసుకున్న యాతడు తాను సేద్యము చేయకయే, ఇంకొకనికి కవులునకు యివ్వవచ్చును. కవులుకు పుచ్చుకొన్నవారు సాగుచేసికొని, కవులుషరతుల ప్రకారము శిస్తు మొత్తమును ధనరూపముననో, ధాన్యరూపముననో కవులునకు యిచ్చిన యాతనికి యిచ్చి, గడువు అయిపోయిన తరువాత కవులుభూమిని తిరిగి స్వాధీనము చేయువలసియుండును. పట్టాదారును భూమిలోనుండి తొలగించే హక్కు ప్రభుత్వమునకుగాని, జమీందారునకుగాని లేదు.

ఈ పద్ధతులుగాక మొఖాసాదారీ, యీనాందారీ మొదలైన కొన్ని పద్ధతులున్ను కలవు. అవి స్వల్ప విషయములై, కొలది ప్రదేశములందు మాత్రమే యున్నందు వలన గ్రంథవిస్తర భీతిచే నిక్కడ ఉదాహరించలేము.

ఇంగ్లీసు ప్రభుత్వములు అధికారములోనికి వచ్చి

నప్పటి నుండియు, ఈ విధానములలో ముఖ్యములైన కొన్ని మార్పులను చేయ సమకట్టిరి. వీనిలో జమీందారీ విధానమును రద్దు చేయుట యొకటి. మద్రాసు శాసనసభలలోను, సంయుక్తరాష్ట్ర శాసనసభలలోను జమీందారీ విధానమును రద్దు చేయవలయు ననుతీర్మానము లామోదింపబడెను. మద్రాసుప్రభుత్వమున ప్రస్తుతము ప్రధాన మంత్రిగా నున్నట్టియు, లోగడ కాంగ్రెసు ప్రభుత్వములో రెవిన్యూ మంత్రిగా నున్నట్టియు శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి అధ్యక్షత క్రింద యేర్పడిన సంఘమువారు, ఈ జమీందారీ పద్ధతిని గూర్చి సాకల్యముగా చర్చించి ఒక పెద్ద నివేదికను తయారు చేసిరి. "శాశ్వతవు టొడంబడిక పద్ధతి" ప్రకారము జమీందారు ప్రభుత్వమున కిచ్చే మొత్తమున్ను, రయితు జమీందారునకిచ్చే శిస్తురేట్లున్ను శాశ్వతముగా ఏర్పాటు చేయబడి యున్నవనియు, అందుకు భిన్నముగా రయితుల వద్దనుండి జమీందారులు హెచ్చురేట్లతో శిస్తులు వసూలు చేయుచున్నారనియు, అట్లు వసూలు చేయుట క్రమవిరుద్ధమనియు, అందువలన 1802 వ సంవత్సరమునందు రయితులు జమీందారులకు ఏరేట్ల ప్రకారము శిస్తులు చెల్లించిరో, ఆ రేట్లమేరకు ప్రస్తుతపు శిస్తులు తగ్గించవలెననియు, ఆ నివేదికలో వివరింప బడెను. ఈ నివేదికను బట్టి జమీందారీ విధానములో మార్పులు జరుగవచ్చును.

అంతియేకాక రయిత్వారీ విధానములోకూడా కొన్ని మార్పులు రావచ్చును. ఇప్పు డధికారములోనున్న ప్రజా ప్రభుత్వములు ఈ కార్యములకై పూనుకొనుచున్నవి. ఎట్టి

మార్పులు జరుగునో చెప్పజాలము కాని, మార్పులు జరుగునని మాత్రము చెప్పవచ్చును. స్వయముగా సేద్యము చేయువారికి ఎక్కువ సదుపాయములు లభించవచ్చునని ఊహించవచ్చును. అట్టిది న్యాయమే యగును. లేకున్న సేద్యముచేయువానికి తగినంత ఉత్సాహముండనేరదు. అతనికి ఉత్సాహము మందగిల్లినచో ధాన్యాదుల ఉత్పత్తి తగ్గిపోవును. ఉత్పత్తి తగ్గినచో క్షామము తాండవించును.

# 4 వ అధ్యాయము



## వ్యవసాయము

ప్రాచీనకాలమునుండియు భారతదేశ సౌభాగ్యము వ్యవసాయముమీదను, గ్రామపరిశ్రమలమీదను ఆధారపడియున్నది. గ్రామసీమలే పురాతన ఔన్నత్యమునకు ఆలవాలములు. పాశ్చాత్య నాగరికతా వ్యామోహమువల్లను, బ్రిటిషు రాజనీతివల్లను గ్రామసీమలయొక్క సౌభాగ్యస్థితి సన్నగిల్లెను. ఎప్పటికైనను మన దేశము తొల్లింటి ప్రాముఖ్యమును పొందవలెనన్నచో, ఏడులక్షల గ్రామములయొక్క పునర్నిర్మాణము మిక్కిలి యవసరము.

## ప్రాచీన గ్రామములు

పూర్వమున గ్రామములు స్వయంసమృద్ధములుగా నుండెడివి. ఆర్థిక సౌభాగ్యమునకు గ్రామములే పునాదులు. ప్రజలకు అవసరములగు వస్తువులన్నియు గ్రామములలోనే ఉత్పత్తి

యగుచుండెను. అన్నవస్త్రములు ప్రధానద్రవ్యములు గావున అవిరెండును గ్రామములలోనే సమృద్ధిగా ఉత్పత్తియగుచుండెను. గ్రామములోని భూమియంతయు గ్రామీణులకు చెందియుండెడిది. వ్యవసాయముకూడా సమష్టిగా జరుగుచుండెను. వ్యవసాయమునకు కావలసిన నాగలి, బండి మొదలైనవి చేయుటకు వడ్రంగులున్ను; కఱ్ఱు, పలుగు, పార మొదలైన ఇనుపపనిముట్లు చేయుటకు కమ్మరులున్ను గ్రామము లోనే యుండెడివారు. గ్రామలెక్కలను తయారుచేయుటకు కరణము, పన్నులు వసూలుచేయుటకు మునసబు, వెట్టిపని చేయుటకు గ్రామవెట్టి మొదలగు గ్రామోద్యోగు లుండెడివారు. వ్యవసాయము రానురాను సాముదాయక పద్ధతుల మీద జరుగుట అంతరించి, వ్యష్టిగా భూములను గ్రామీణులు పంచుకొని, వ్యవసాయము చేయుచూ వచ్చిరి. నేటికి వ్యక్తిపరముగా వ్యష్టిపద్ధతిగా వ్యవసాయము చేయుటయే మనము చూచుచున్నాము.

స్వదేశ సంస్థానముల విడిచి, లెక్క తేల్చినచో మన దేశములోని వ్యవసాయపుభూమి 51 కోటి 19 లక్షల యకరములు. అందులో అడవులక్రింద 6 కోట్ల 81 లక్షల యకరములున్ను; సాగుకు లాయకుకానిభూమి 8 కోట్ల 93 లక్షల యకరములున్ను; సాగులోలేనిభూమి 14 కోట్ల 50 లక్షల యకరములున్ను మినహాయించగా, సాగులోనికి తేబడినభూమి షుమారు 21 కోట్ల యకరములు అయియున్నది. ఇందులో నీటి వసతులుకలిగి సేద్యమగుచున్న భూమియొక్క విస్తీర్ణము షుమారు 5 కోట్ల 51 లక్షల యకరములు.

## పంటలు, కాయధాన్యములు

మన దేశములో అనేకపంటలు పండుచున్నవి. ఈ పంటలను రెండువిధములుగా భాగించవచ్చును. (1) ఆహారపదార్థములు (2) ఆహారపదార్థములుకానివి. వరి, గోధుమ, జొన్న మొదలగునవి ఆహారపదార్థములు. ప్రత్తి, జనపనార మొదలగునవి పరిశ్రమలకు ఉపయోగించే పదార్థములు. ఆహారపదార్థములలో ముఖ్యమైనది వరిపంట. వరిపంటక్రింద దేశములో సాగుఅయ్యే భూమియొక్క విస్తీర్ణము షుమారు 7 కోట్ల 80 లక్షల యకరములు. అందులో పండేపంట షుమారుగా 2కోట్ల 90 లక్షల టన్నులు అని అంచనా వేయుబడినది. తరువాత ముఖ్యమైనపంట గోధుమపంట. షుమారు 3 కోట్ల 50 లక్షల యకరములు గోధుమక్రింద సాగుఅగుచున్నవి. అందులో షుమారు ఒక కోటి టన్నుల గోధుమలు పండుచున్నవి. దీటి తరువాత జొన్న, మొక్కజొన్న, రాగి, బార్లే మొదలగు పంటలు ప్రాధాన్యము వహించుచున్నవి. ఈ కాయధాన్యములకుగాను షుమారు 7 కోట్ల యకరములు సాగులోనున్నవి. వీటి మొత్తముపంట షుమారు 1 కోటి 70 లక్షల టన్నులని అంచనా వేయబడినది.

## పప్పుదినుసులు

కాయధాన్యములతోపాటు, సరియైన ఆహారము నీయగల పంటలు పప్పుదినుసుల పంటలు. పప్పుదినుసులు కూడ ఉండిననేగాని మనము తినే ఆహారము ఆరోగ్యకరమున్ను, బలకరమున్ను కాజాలదు. మన దేశములో యీ పప్పుదినుసులు పండే విస్తీర్ణము షుమారు 1 కోటి 50 లక్షల యకరము-

లుండుననియు, పంట షుమారు 35 లేక 40 లక్షల టన్నుల వఱకు ఉండుననియు అంచనా వేయబడినది. ఏయే రాష్ట్రములలో యీ పంటలుపండునది, మొదటి అధ్యాయములో సూక్ష్మముగా వివరించినందున, పునరుక్తి దోషభయముచేత ఆవిషయము యిక్కడ వదిలి వేయబడినది.

## పండ్లు, కూరలు

ప్రజలు మంచి ఆరోగ్యస్థితిలో నుండవలయు నన్నచో కాయధాన్యములు, పప్పు ధాన్యములతోబాటు కూరగాయలు, ఫలములుకూడా పండించుట మిక్కిలి అవసరము. వీటియొక్క పంటను గూర్చి, యికముందుముందు ప్రజాప్రభుత్వములు ఎక్కువ శ్రద్ధతీసికొనుట అవసరము. ఇంతవఱకు తగినంతగా యివి ఉత్పత్తి యగుట లేదు.

## చెఱకు

మనకు కావలసిన ఆహారపదార్థములలో పంచదార కూడా చాలా ముఖ్యమైనది. మన దేశమునకు చాలినంత పంచదార పండుట లేదు. ఇదివఱలో జావా దేశమునుండి పంచదార దిగుమతి యగుచుండెడిది. రానురాను పంచదారను ఉత్పత్తిచేసే నూతనపద్ధతులు ఆచరణలోనికి వచ్చుటచేతను ప్రభుత్వమువారు పంచదార పరిశ్రమకు ఇచ్చిన రక్షణవల్లను, మన దేశములో చెఱకుపంట వృద్ధియైనది. షుమారు 40 లక్షల యకరముల భూమి చెఱకు పంటక్రింద సాగు అగుచున్నది.

## నూనెగింజలు

ఆహారధాన్యముల తరువాత, నూనెగింజలు ప్రాధా

న్యము వహించును. నూనెగింజలలో ముఖ్యమైనవి అవిసె, వేరుశనగ, నువ్వులు, ఆముదము, కొబ్బరి, ప్రత్తి విత్తులు మొదలైనవి. వీటిక్రింద షుమారు 1 కోటి 78 లక్షల యకరముల భూమి సాగగుచున్నది. ఈ నూనెగింజలు విరివిగా విదేశములకు ఎగుమతి చేయబడు చున్నవి. యుద్ధమునకు పూర్వము ఏటేట షుమారు 9 లక్షల టన్నుల గింజలు విదేశములకు ఎగుమతి చేయబడు చుండెను. ముఖ్యముగా జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ దేశములకు ఎగుమతి జరుగుచుండెను.

## నా ర వ స్తు వు లు

నారవస్తువులనగా ప్రత్తి, జనపనార. ప్రత్తిపంటకు అమెరికా దేశము తరువాత, భారతదేశమే ప్రాధాన్యము వహించుచున్నది. కాని మన ప్రత్తిపంటకును అమెరికా, ఈజిప్టు మొదలైన దేశములలో పండే ప్రత్తి పంటకును భేదము కలదు. మన ప్రత్తివలన మిక్కిలి సన్నమైన దారము గల నూలు తీయుటకు వీలుండదు. అమెరికా, ఈజిప్టు దేశములలోని ప్రత్తివలన మిక్కిలి సన్నమైన నూలు తీయ వచ్చును. సన్నమైన నూలువలన సన్నసిబట్టలు తయారగును. సన్నని నూలునకు అనువైనప్రత్తిని పండించుటకు ప్రభుత్వము వారు ప్రయత్నముల చేయుచున్నారు. మన దేశములో పండే ప్రత్తిలో కొంత భాగము విదేశములకు ఎగుమతి యగుచుండెడిది. పూర్వము అనగా యుద్ధము రాకముందు జపాను, చీనా దేశములకు ముఖ్యముగా ప్రత్తి ఎగుమతి యగుచుండెడిది. షుమారు 2 కోట్ల 80 లక్షల యకరముల భూమిలో ప్రత్తి పండుచున్నట్లును, 62 లక్షల బేళ్ల ప్రత్తి సాలియానా

ఉత్పత్తి యగుచున్నట్లున్ను అంచనా వేయబడినది. పంటలో దాదాపు సగము యుద్ధమునకు పూర్వము యితర దేశములకు ఎగుమతి యగుచుండెడిది.

జనపనార మన దేశములో తప్ప ఇంకెచటను ఉత్పత్తి యగుట లేదు. ముఖ్యముగా బెంగాలు, అస్సాము రాష్ట్రముల యందును, బీహారు, ఒరిస్సా, రాష్ట్రములయందును, యీ పంట గలదు. మన దేశమునుండి విదేశములకు ఎగుమతి అయ్యే వస్తువులలో జనపనారకూడా ప్రధానమైనది. దీనిక్రింద సాగగు చున్న భూమి షుమారు 30 మొదలుకొని 35 లక్షల యకర ములవరకు ఉండుననియు, సంవత్సరమునకు 9 లక్షల టన్నుల జనపనార ఉత్పత్తి యగుననియు అంచనాలు కలవు. జనపనార ఎగుమతులు ఇంగ్లాండు, జర్మనీ దేశములకు ప్రధానముగను, ఫ్రాన్సు, జపాను, ఇటలీ, అమెరికా, బెల్జియం, స్పెయిను దేశములకున్ను జరుగుచున్నవి.

## ఇతర వస్తువులు

నీలిమందు, నల్లమందు, కాఫీ, తేయాకు, పొగాకు, రబ్బరు మొదలగు వస్తువులుకూడా ఉత్పత్తి యగుచున్నవి. జర్మనీ దేశములో కృత్రిమమైన నీలిమందు చౌకగా తయారయ్యే వరకు మన దేశములోని నీలిమందుకు మిక్కిలి గిరాకీ ఉండెడిది. తరువాత నీలిమందుకు గిరాకీ క్షీణించిపోయినది. మద్రాసు, సంయుక్తపరగణాలు, బీహారు, ఒరిస్సా, బెంగాలు రాష్ట్రము లలో నీలిమందు పండును.

పూర్వము నల్లమందు విశేషముగా ఉత్పత్తిచేయబడి చీనా మొదలగు దేశములకు ఎగుమతి చేయబడుచుండెడిది.

రానురాను ఔషధములకొరకు మాత్రమే నల్లమందు ఉత్పత్తి యగుటవల్లను, ప్రభుత్వపు కంట్రోళ్లు అమలుజరుపబడినందు నను, నల్లమందు వ్యవసాయము క్షీణించిపోయెను.

మద్రాసు, మైసూరు, కొచ్చిన్, తిరువాంకూరు ప్రాంత ములయందు కాఫీ పంటలు పండును.

చీనాదేశము తప్ప, తేయాకును ఉత్పత్తి చేయుటలో భారత దేశమునకు పోల్చతగిన దేశము లేదు. ఇది అస్సాము, బెంగాలు, సంయుక్తపరగణాలు, మద్రాసు, తిరువాంకూరు రాష్ట్రములయందు పండును. ప్రధానముగా యీ తేయాకు యింగ్లాండు దేశమునకు ఎగుమతియగును.

దక్షిణ భారతమునందును, బెంగాలు రాష్ట్రమునందును పొగాకును విశేషముగా పండించెదరు. పొగాకు చాలమట్టుకు మన దేశములోనే ఖర్చుఅగును. కాని మద్రాసు రాష్ట్రములో పండించే దొరపొగాకు విదేశములకు ఎగుమతి యగుచున్నది.

మద్రాసు, మైసూరు, తిరువాంకూరు, కొచ్చిన్ ప్రాంత ములయందు రబ్బరుపంట పండుచున్నది. రాబోవు కాలములో యీ పంటకు ఎక్కువ ప్రాధాన్యము రాగలదు. నేడు మనదేశ మున పండుచున్న రబ్బరును వినియోగించుటకు తగిన పరి శ్రమలు లేని కారణమున విదేశములకే చాలభాగము ఎగు మతి చేయబడుచున్నది.

పైన చెప్పబడినవిగాక పశుగ్రాసమునకై కొంతభూమి సాగుచేయబడుచున్నది. ఈ భూమి ఒక కోటియకరముల వరకు ఉండునని అంచనాలవల్ల తెలియుచున్నది.

## త క్కు వ పం ట

ఇతర దేశములతో పోల్చినయెడల మన దేశములోని వ్యవసాయము అంతఫలప్రదముగా లేదు. యకరమునకుపండే దామాషాపంట చాల తక్కువగా నున్నది. ఇటలీ దేశములో యకరమునకు దామాషామీద రెండుటన్నుల వరిధాన్యము పండుచున్నను, మన దేశములో అరటన్నుకూడా పండుట లేదు. అమెరికా, ఈజిప్టు దేశములలో యకరమునకు 400 పౌనులు ప్రత్తి పండుచుండ, మన దేశములో 100పౌనులకంటె ఎక్కువ పండుట లేదు ఈ తారతమ్యమునకు అనేక కారణము లున్నవి. అతివృష్టి, అనావృష్టి, తుపానులు, వఱదలు, తెగుళ్ళు, జంతు బాధ, వ్యవసాయపద్ధతులయందలి లోపములు,రైతుబీదరికము. చాలమంది రైతులకు ఒకనాగలికైనను సరిపోయిన భూమి లేకుండుట, నీటివసతులు లేకుండుట మన దేశములో తక్కువ పంట పండుటకు ప్రధానకారణములు.

## వ్య వ సా యా భి వృ ద్ధి మా ర్గ ము లు

(1) సేద్యపుభూమి విస్తీర్ణము:— వారసత్వపు లా ప్రకారము భూమి పంపిణీ కావలసియున్నది. ఒక యకరము భూమికి నలుగురు హక్కుదారులైనచో, నలుగురున్ను తల కొక 25 సెంట్లుచొప్పున పంచుకొనవలసియున్నది. ఇందువలన పెక్కుమందికి వ్యవసాయము చేయుటకు చాలినంతభూమి లేక పోవుచున్నది. సాగుచేయుటకు అధమము 10 యకరములైనను లేనియెడల వ్యవసాయము గిట్టుబడికాదు. కావున సహకార పద్ధతులకూడనో, లేక మఱియొక విధముగానో, రయితులకు

గిట్టుబాటు అగురీతిని, సేద్యముచేసే భూములయొక్క విస్తీర్ణ మును నిర్ణయించవలయును.

(2) నీటివసతులు .—నీటివసతులు సరిగానున్న చో భూమి చక్కగా ఫలించును. అతివృష్టి అనావృష్టివలన సంభవించే బాధలను అంతమొందించుటకు నీటివసతులను కల్పించవలసియున్నది. నదులకు ఆనకట్టలను ఆశ్రయములను కట్టి కాల్వలగుండా నీటిని ప్రవహింపచేయుట, మంచినూతులు త్రవ్వుట, నీటిని తోడుటకు విద్యుచ్ఛక్తి సహాయమునొసగుట, మొదలగునవి అవసరము.

(3) మురుగు సౌకర్యములు:— ఎక్కువనీటితో అవసరమున్న వరి మొదలగు ధాన్యములు పండునట్టి ప్రదేశములలో నీటిరాకకై వసతులు ఎంతఅవసరమో, నీటిపోకకుకూడా వసతులు అంత అవసరము. అట్టి వసతులను అవసరమైన చోట్ల కల్పించుటవలన పంటలు ఎక్కువగా పండును.

(4) మంచికూలీలు:— సమర్థులున్ను, తెలివి గల వారున్ను, బాగుగా పనిచేయుగలవారున్ను అగు కూలీలను ఏర్పాటు చేసినచో వారు చక్కగా పనిచేసి భూమిని ఫలవంతముగా చేయుగలరు. వారు ఆకలిచేత మలమలమాడుచున్నను అనారోగ్యముచేత శక్తికి హీనులైనను సరిగా పనిచేయజాలరు. వారు సరిగాపనిచేయనిచో సేద్యము తగినఫలసాయము నివ్వజాలదు. కావున కూలివారియొక్క స్థితిగతులను బాగుచేయవలయును.

(5) వ్యవసాయపు పనిముట్లు:— పనిముట్లు సరిగా లేకున్నచో ఎంత సమర్థుడైనను సరిగా పనిచేయజాలడు. నవీన పద్ధతులప్రకారము తక్కువకాలములో ఎక్కువపని చేయుటకు వీలైనపనిముట్లను మన దేశ పరిస్థితులకు అనుకూలమగునట్లుగా శాస్త్రవేత్తలు వ్యవసాయశాఖానుభవజ్ఞులు కనిపెట్టి నిర్మించవలసి యున్నది. అట్లునిర్మించిన ఉపకరణములను రైతులు శ్రద్ధగా ఉపయోగించుటచేత సేద్యమువలన ఎక్కువఫలము అనుభవించుటకు వీలగును.

(6) పశువులు:— వ్యవసాయము యొక్క స్థితి మన దేశములో విశేషముగా పశుసంపదమీద ఆధారపడియున్నది. మన దేశములో పశువులు విశేషముగానున్నను తగినంతమేత లేకతగినంత దృఢముగా లేవు. వ్యవసాయమునకు ఎద్దులుప్రధాన భూతములు. సరియైన ఎద్దులు కావలయునన్నచో వానికి తగినంత గ్రాసమును సమకూర్చుటయేగాక, మంచి దూడలను సంపాదించుటకు మంచి ఆబోతులు కావలసియున్నవి. పశువుల చికిత్సకై ఆస్పత్రులను కూడ విరివిగా నిర్మించవలసి యున్నది.

(7) ఎరువులు:— శాస్త్రవేత్తలు మన దేశములోని భూములను పరిశీలించి, యేయే భూములకు యేయే రకములైన ఎరువులు వలయునో, వాటిని తయారుచేయుటకై యేర్పాటులు కావింపవలసియున్నది. ఏ యే యెరువులు ఏ యే పైరులకు అనుకూలమో, ఆవిషయమునుకూడ నిర్ణయించవలసి యున్నది. అట్టి ఎరువులను రైతు లుపయోగించునట్లు చేయువలయును. రైతుసమక్షమున ఎఱువులనువాడి అందువలన ప్రత్య

క్షముగా లాభమును చూపించగలిగినచో, రైతులా యనుభవ మును చూచి తప్పక ఎరువులను ఉపయోగించగలరు.

(8) వ్యవసాయికుని ఆర్థికస్థితి:— మంచి ఎరువులు సంపాదించుటకుగాని మంచి ఎద్దులను కొనుటకుగాని నవీనము లగు వ్యవసాయపు పనిముట్లను కొనుటకుగాని రైతుయొక్క ఆర్థికస్థితి బాగుగా నుండవలెను. అందులకై వ్యవసా యమునకు తోడుగా ఇతర ఉపవృత్తులు అవసరము. వీటినే గృహపరిశ్రమలందురు. వేఱొక అధ్యాయమున వీటినిగురించి వివరింపబడును. గృహపరిశ్రమలనే ఉపవృత్తులవలన వ్యవసాయి కుని ఆదాయము పెరుగును. దానివలన, కుటుంబపోషణమే కాక, వ్యవసాయమునకై పెట్టుబడికూడా లభించగలదు. కావున రైతుయొక్క ఆర్థికస్థితిని బాగుచేయుటకు గ్రామములయందు గృహపరిశ్రమల నెలకొల్పుట మిక్కిలి యవసరము.

(9) ఋణభారమును తగ్గించుట:— ఏకొలదిమంది మోా తప్ప, సర్వసాధారణముగా ఋణములేని రైతు లేనేలేడు. భూమిలోనుండి వచ్చేరాబడి కుటుంబ రక్షణమునకే చాలదు. వ్యవసాయపు ఖర్చులకు, ఇతర కుటుంబ ఖర్చులకు రైతు అప్పు తేవలసియున్నది. ఒక్కొక్క సంవత్సరము గడిచిన కొలది ఋణభారము ఎక్కువ యగుచున్నది. మొదట ప్రోనోట్లమీాదను, తరువాత తనఖా పత్రముల మీాదను ఋణము తెచ్చి ఆ ఋణమును తీర్పలేక భూమిని విక్రయించు చున్నాడు. 1931 వ సంవత్సరములో బ్యాంకింగు విచారణ సంఘమువారు దర్యాప్తుచేసి, మన దేశములోని రైతుల యొక్క ఋణపు మొత్తము 900 కోట్ల రూపాయలుండునని

అంచనా వేసిరి. ఇప్పటికి యింకను ఆ మొత్తము పెరిగియే యుండును. అయితే 1937 సంవత్సరమున అధికారములోనికి వచ్చిన కాంగ్రెసుప్రభుత్వములు కొన్నిరాష్ట్రములయందు ఋణపరిహార చట్టములను అమలుజరిపి కొంతవరకీ భారమును తగ్గించినవి. అయినను యింకా కోట్లకొలదిగా ఋణభారము రైతులకు కలదనుట అతిశయోక్తి గాదు.

ఈ ఋణ భారమును తగ్గించుటకు ప్రభుత్వము కొన్ని యితర శాసనములను చేసినదిగాని, ప్రయోజనమంతగా నున్నట్లు కనుపడుట లేదు. భూమి మరమ్మతులు వగైరాలకు ప్రభుత్వము అప్పు లిచ్చునట్లుగా కొన్ని శాసనములు చేయబడినవి, కాని ప్రభుత్వ పద్ధతులలోని చిక్కుల వలన, వాని వలని ఉపయోగమును రైతులు పొందజాలకపోయిరి.

(10) సహకారోద్యమము:— రైతులు తమకు అప్పు కావలసివచ్చినయెడల షాహుకార్ల వద్దకు పోయి, హెచ్చు వడ్డీలకు, ఋణములు తీసికొను చున్నారు. ఈ హెచ్చు వడ్డీలను తీర్చలేక రైతులు తమ భూములను అమ్ముకొను చున్నారు. ఈ దుస్థితిని తొలగించుటకు సహకార సంఘములను స్థాపించుచు 1904, 1912 సంవత్సరములలో ప్రభుత్వము వారు శాసనములను చేసిరి. ఆ శాసనములను బట్టి సహకార సంఘములు నెలకొల్పబడెను. 1941 సం॥ నాటికి ఒకలక్ష నలుబది రెండువేల సహకారసంఘములు మన దేశములో పనిచేయుచుండెను. వీనిలో షుమారు 64 లక్షల మంది సభ్యులుండిరి. షుమారు 110 కోట్ల రూపాయల వ్యాపారము జరుగుచుండెను. వీనిలో చాలభాగము ఋణములనిచ్చె

సంఘములే. చేనేత పారిశ్రామిక సహకార సంఘము వంటి యితర విధములైన సంఘములుకూడ కలవు. అట్టివి తమ సంఘములలో సభ్యులైనవారి యొక్క యితర అవసరములను గడపుటకు ఉపయోగించుచున్నవి. ప్రస్తుతము మద్రాసు ప్రభుత్వమువారు అక్కడక్కడ ఉత్పత్తిదారుల కొనుగోలు దారుల యొక్క సహకార సంఘములను స్థాపించుచున్నారు. ఈ యుభయులయొక్క యోగక్షేమముల కొరకై యీ సంఘము లుద్దేశింపబడినవి. ఉత్పత్తి దారులు తమకు నష్టము కానిరీతిని, తమసరకులను విక్రయించుటకున్ను, కొనుగోలు దారులు తమకు నష్టముకానిరీతిని సరకులు కొనుటకున్ను ఏర్పాటు చేయుట ఈ సంఘముల యొక్క ముఖ్యోద్దేశము.

ఈ సహకారోద్యమము క్రిందనే భూమితనఖా బ్యాంకులుకూడా కొన్నిచోట్ల నిర్మింపబడినవి. మామూలు సహకార పరపతి సంఘములలో దీర్ఘవాయిదాలమీద ఋణము లివ్వబడవు. దీర్ఘవాయిదాలు లేనిచో, రైతు ఋణమును తీర్చు కొనజాలడు. కొన్ని సంవత్సరముల వాయిదాల మీద తీర్చే యేర్పాటుతో సహకారపద్ధతిబట్టి భూమితనఖా బ్యాంకులు నిర్మింపబడి రయితుయొక్క భూములను తనఖాపుంచుకొని ఋణమునిచ్చి సహాయము చేయుచున్నది.

పై విధముగా వ్యవసాయాభివృద్ధికి ప్రయత్నము చేయ వలసి యున్నది. దీనికి ముఖ్యముగా ప్రభుత్వములయొక్కయు ప్రజలయొక్కయు పరస్పర సహకారము అవసరము. వ్యవసాయాభివృద్ధి జరుగకున్నచో భారతదేశమునకు పునాదులైన గ్రామములు క్షీణించి నశించిపోగలవు.

# 5 వ అధ్యాయము



## పరిశ్రమలు

నవ్యప్రపంచములో ఏ రాష్ట్రములే అగ్రస్థానము ఆక్రమించుచున్నవి ఏ దేశము పరిశ్రమాభివృద్ధిలో అగ్రగణ్యమగుచున్నదో, ఆదేశమే నాయకమణి యగుచున్నది. పరిశ్రమల యభివృద్ధివలన దేశసౌభాగ్యము పెంపొందును. అనేకులకు వృత్తులు, జీవనములు కల్పింపబడును. ప్రజల శక్తిసామర్థ్యములకు అవకాశములు కలుగును. ప్రభుత్వమునకు ఆదాయము హెచ్చును. దేశమునకు గౌరవప్రతిపత్తులు అధికమగును. పారిశ్రామిక దృష్టిలో మన దేశము మిక్కిలి వెనుకబడియున్నది. ఒకానొకప్పుడు మన దేశము భోగభాగ్యములతో తులతూగుచు, అనేకవస్తువులను ఇతర దేశములకు ఎగుమతి చేయుచుండెడిదని చరిత్రవలన దెలియుచున్నది. పరరాజ్యమువలన మన పరిశ్రమలు, మన భోగభాగ్యములు నశించి మన దేశము అథఃస్థితిలోనున్నది మన పరిశ్రమలన్నియు నాశనము చేయబడెను. మన దేశమునుండి తయారైన వస్తువులు ఇతర దేశములకు ఎగుమతి యగుటకు బదులు, మనమే దిగుమతి చేసికొనవలసి వచ్చెను. మన దూది విదేశములకు గొంపోబడి అక్కడ వస్త్రములుగా తయారై, తిరిగి మనకు అమ్మబడెను. అటులనే యితర ముడిపదార్థములను మన దేశమునుండి కొంపోయి, వాటిని తయారుచేసి, తిరిగి మన దేశమునకు దిగుమతిచేసిరి. మొదటి జర్మనీయుద్ధమగుసరికి యీ పద్ధతి సరియైన పద్ధతి

కాదని బ్రిటిషువారు గ్రహించిరి. యుద్ధకాలములో యీ ముడి వస్తువులను తమ దేశములకు తీసికొని పోవుటకుగాని, తీసికొనివెళ్లిన వస్తువులను తయారు చేయుటకుగాని అవకాశములు లేకపోయెను. భారతదేశములోనే వస్తువులు తయారై యుండిన యెడల యుద్ధనిర్వహణమునకు ఎంతో ఉపయోగకరముగా నుండెడిదని వారు గ్రహించిరి. ఆ యుద్ధమువలన కలిగిన అనుభవమును బట్టిన్ని, తరువాత గాంధీమహాత్ముని నాయకత్వమున జరిగిన మహోద్యమమునుబట్టిన్ని తమ విధానమును ప్రభుత్వమువారు క్రమముగా మార్చుకొనుచువచ్చిరి. విదేశవస్తువుల యొక్క పోటీకి తాళియుండుటకై, మన దేశీయవస్తువులకు కొంతరక్షణము నొసంగ నిశ్చయించిరి. ఎట్టిరక్షణ యేయే విధములుగా యివ్వవలెనో నిర్ణయించుటకు ఒక రక్షణ సంఘమును (Tariff Board) 1924 సంవత్సరములో నేర్పఱిచిరి. ఇట్లు యీ విధానములో కలిగిన మార్పులను బట్టి ఇనుము, ఉక్కు, వస్త్రము, కాగితము, పంచదార, ఉప్పు, నిప్పుపెట్టెలు మొదలైన పరిశ్రమలకు రక్షణ యొసంగబడెను. ఈ విధానమును "పరిశీలన రక్షణ" విధానమందురు. ఏయే వస్తువులను పరిశీలించి రక్షణ నొసంగుచో, ఆవస్తువులు విదేశీయ వస్తువులతో పోటీకినిల్చి, కొంతకాలమైన తరువాత రక్షణలేకయే నిలువద్రొక్కుకొనగలవో వానిని పరిశీలించి రక్షణ నొసంగుటయే యీ విధానముయొక్క ముఖ్యోద్దేశము.

## ప్రస్తుత క్షీణదశకు కొన్ని కారణములు

గృహపరిశ్రమలద్వారా తయారుచేసే వస్తువులుతప్ప, భారీపరిశ్రమలవలన తయారయ్యేవస్తువులను ఉత్పత్తిచేయు

టకు పెద్ద యంత్రసామగ్రి కావలయును. ఆ యంత్రములు విదేశములనుండి రావలయును. వాటిని విక్రయించుటకు విదేశీయులు అంగీకరించవలెను. అంగీకరించినను కొనుటకు ధనము కావలయును. ఆ ధనముకూడ ఆ దేశమువారు అంగీకరించదగిన ధనము కావలయును. ఆ ధనము సేకరించినను ఆసామగ్రిని మన దేశమునకు జేర్చుటకు నావలు మొదలైనవి కావలెను వానిని సంపాదించినను, ఆ యంత్రములను నెలకొల్పుటకు చాలిన ప్రావీణ్యముగలవారు కావలెను. ఎటులనో వానిని నెలకొల్పినను వానిని నడపుటకు ఆ సాంకేతికవిద్యను అభ్యసించినవారు కావలెను. ఈవిధములైన చిక్కులెన్నియో గలవు. మనకు సంపూర్ణస్వరాజ్యము లభించిననేగాని యీ చిక్కులు తీరవు.

## పరిశ్రమలు-వానిభేదములు-భారీపరిశ్రమలు

పరిశ్రమలను రెండువిధములుగా విభజించవచ్చును. (1) భారీపరిశ్రమలు (2) గృహాపరిశ్రమలు. (1) భారీ పరిశ్రమలు అనగా, ఎక్కువ పెట్టుబడితో, పెద్ద పెద్ద యంత్రములు నిర్మించి తద్వారా వస్తువులను ఉత్పత్తి చేయునవి. పెద్ద పెద్ద పెట్టుబడులు కలిగి, గొప్పయంత్రములు యేర్పడి, విస్తారమైన వ్యవస్థలు కలిగిన పరిశ్రమలకు భారీపరిశ్రమలని పేరు. ఇట్టివి కొన్ని మనదేశమున గలవు. దూదియంత్రములు, జనపనారయంత్రములు, ఇనుము ఉక్కు యంత్రములు, రసాయన యంత్రములు, కాకితపుయంత్రములు, చర్మయంత్రములు మొదలైనవి కలవు. బొంబాయి, అహమ్మదాబాదు, షోలాపూరు, హుబ్లి, నాగపూరు, కోయంబత్తూరు, మధుర, మద్రాసు

మొదలైన ప్రదేశములయందు దూదిమిల్లులు గలవు. మొదటి జర్మనీయుద్ధము పూర్వమువరకు ఇంగ్లాండు దేశములోనుండి వస్త్రములు విరివిగా దిగుమతి యగుచుండెడివి. ఆయుద్ధము వలనను, గాంధిమహాత్ముని స్వదేశీ యోద్యమమువలనను, భారత ప్రభుత్వమువారు నిర్ణయించిన రక్షణలవలన దూదియంత్ర పరిశ్రమ మన దేశములో వృద్ధి జెందినది. రక్షణ లేకున్నను పరిశ్రమ వృద్ధినందెడు దేమోకాని, జపాను దేశము చౌకగా వస్త్రములను దిగుమతిచేసి పోటీచేసినది. రక్షణవిధానమువలన జపాను పోటీ భయము అంతరించినది. రక్షణవిధానమునుబట్టి విదేశముల నుండి దిగుమతి అయ్యే వస్తువులపై దిగుమతి సుంకములు విధింపబడెను. ఈ సుంకముల మూలమున మన పరిశ్రమలలో ఉత్పత్తికాబడిన వస్త్రములకంటె విదేశవస్త్రములు గిరాకి అయ్యెను. 1940 వ సంవత్సరమునాటికి మన దేశములో 388 వస్త్రయంత్రాగారములుండెను. వీటిపెట్టుబడి షుమారు 50కోట్ల రూపాయలు. ఈ పెట్టుబడిలో విశేషభాగము భారతీయులకే చెందియున్నది. పెత్తనముకూడా విశేషముగా భారతీయుల హస్తములలోనే యున్నది.

జనపనార యంత్రములు బెంగాలు రాష్ట్రమందుగలవు. 1938 సం॥ నాటికి మనదేశములో 105 యంత్రములుండెను. వీనిలో చాలభాగము కలకత్తా చుట్టుపట్ల ఉన్నవి. జనపనార సంచులయొక్క యుత్పత్తిలో మనదేశము ప్రపంచములో ఉన్నతస్థానము నాక్రమించుచున్నది.

ఉక్కు ఇనుము పరిశ్రమ మన దేశములో ముఖ్యమైన పరిశ్రమ అయివున్నది. జంషెడ్‌పూరు అనే నగరములో

టాటాకంపెనీవారు బ్రహ్మాండమైన యంత్రాగారమును నిర్మించిరి. రెండు ప్రపంచ సంగ్రామములవల్లను 1924 సం॥ నుండి ప్రభుత్వము అవలంబించిన రక్షణ విధానమువలనను యీ పరిశ్రమ మిక్కిలి యభివృద్ధినొందెను. టాటాకంపెనీవారు 1907 సం॥లో యీ యంత్రశాలను స్థాపించిరి.

చర్మ పరిశ్రమకూడా మంచిస్థితిలోనే యున్నది. పైన చెప్పిన పరిశ్రమలకువలె యీ పరిశ్రమకు కూడా యుద్ధములు దోహదమొసంగెను. మన దేశములో పశుసంపద విశేషముగా నున్న కారణమున జర్మనీ, ఆస్ట్రియా, అమెరికా మొదలయిన దేశములకు తోళ్లు ఎగుమతి అగుచుండెడివి. ఎగుమతులు జరుగుచున్నను దేశీయపరిశ్రమ కూడా వృద్ధినందెను. కాన్పూరు, బొంబాయి, మదరాసు ప్రాంతములయందు ఈ పరిశ్రమ వ్యాప్తిజెందెను.

కాకిత పరిశ్రమ మొదటలో కలకత్తా ప్రాంతములయందు స్థాపించబడెను. ఇప్పుడు మనదేశములో 13 యంత్రశాలలు కలవు. 1925 సం॥ నుండి యీ పరిశ్రమకు రక్షణ యొసంగబడెను. యుద్ధమువలన యీ పరిశ్రమకు కూడా సాహాయ్యము లభించెను.

పైన చెప్పబడిన పరిశ్రమలతో బాటు అగ్గిపెట్టెలు, సిమెంటు, గ్లాసు, అల్యూమినము మొదలగు వస్తువులయొక్క ఉత్పత్తి కొఱకు భారీ పరిశ్రమలు నెలకొల్పబడి పనిచేయుచున్నవి.

## గృహ పరిశ్రమలు

గృహపరిశ్రమలకు మనదేశము పుట్టినిల్లు. నవ్యభౌతిక

శాస్త్రజ్ఞానము అభివృద్ధి చెందినకొలదియు భారీ పరిశ్రమలు వృద్ధియయ్యెను. భారీ పరిశ్రమలు గృహపరిశ్రమలకు నిరోధక ములుగావు. ఏ యే వస్తువుల యొక్క ఉత్పత్తికి భారీ పరిశ్రమలు ఎక్కువ ఉపకారకములో, ఏయే వస్తువుల యొక్క ఉత్పత్తికి గృహ పరిశ్రమలు ఎక్కువ ఉపకారకములో యోచించి నిర్ణయించ వలసియున్నది. ఈ నిర్ణయము సులభ సాధ్యము కాదు. కొన్ని వస్తువులు రెండు విధములైన పరిశ్రమల వల్లను లభించగలవు. అట్టిచో భారీపరిశ్రమల నెంతవరకు ప్రోత్స హించవలెను, గృహపరిశ్రమల నెంతవరకు పోషించవలెను, అను విషయము సులభమైనది కాదు.

గృహపరిశ్రమలనగా మిక్కిలి తక్కువ పెట్టుబడితో పెద్దవ్యవస్థలతోగాని బరువైన యంత్రములతోగాని నిమిత్తము లేకుండా వస్తువులను ఉత్పత్తి చేయజాలిన పరిశ్రమలు అని యర్థము. ఖద్దరు, చేనేతపరిశ్రమలు మన దేశములో అనాది సిద్ధములు. దేశీయులెల్లరకు కావలసినంత వస్త్రమును సప్లయి చేయుటయేగాక అమూల్యములైన వస్త్రములను విదేశములకు ఎగుమతి చేయుచుండెడివి. మన దేశము అన్యాక్రాంతమైనందు వలన ఆపరిశ్రమలు సన్నగిల్లెను. తిరిగి గాంధీమహాత్ముని ఉద్య మఫలితముగా యీ పరిశ్రమ తలయెత్తి విజృంభింపసాగెను. అటులనే తివాచీలు, కంబళ్లు మొదలగు పరిశ్రమలు కూడా మన దేశములో చక్కని గృహపరిశ్రమలై యున్నవి. మట్టిపరి శ్రమ, లోహపరిశ్రమ, కత్తులు, గడియారములు, సబ్బులు, పట్టు, తేనె మొదలైనవి తయారుచేయుటకు గృహపరిశ్రమలు ఉప యోగకరములు.

## పట్టు పరిశ్రమాభివృద్ధికి మార్గములు

సరియైనవారికి ఆయాపరిశ్రమలయందు శిక్షణనొసంగి మంచిపనివారలనుగా తయారు చేయవలయును. అందుకు కావలసిన శిక్షణాలయముల నెలకొల్పవలయును. పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థములను సేకరించవలెను. తగినంత పెట్టుబడి ధనమును అమర్చవలయును. క్రొత్త క్రొత్త రకములైన వస్తువులయొక్క ఉత్పత్తిని ప్రోత్సహించవలయును. ప్రజలలో ఉత్సాహమును రేకెత్తించుటకు ప్రదర్శనములజరుపవలయును. వస్తుభాండారముల నెలకొల్పవలయును. తయారైన వస్తువుల విక్రయించుటకు సంఘములు నెలకొల్పి విక్రయమునకు కావలసిన అవకాశములను కల్పింపవలయును. పరిశ్రమలలో పనిచేసే వారియొక్క సౌకర్యములను పెంపొందింపవలయును.

## శ్రామికులు

పరిశ్రమయందుగాని వ్యవసాయమునందుగాని పనిచేసే వారిని శ్రామికులందురు. కొందరు శ్రామికులు వ్యవసాయము నందును మరికొందరు పరిశ్రమలయందును పనిచేయుచున్నారు. మనదేశము వ్యావసాయికదేశమగుటచేత శ్రామికులలో పెక్కుమంది వ్యవసాయమునందే యున్నారు. వారి జీవితము వ్యవసాయముమీదనే ఆధారపడియున్నది. వారియొక్క సమాచారమును తెలుపుటకు వివరములు లేవు. కాని పరిశ్రమలలో పనిచేసే శ్రామికులగూర్చి కొంత ముచ్చటించెదను. పాశ్చాత్య దేశములలోని శ్రామికులకును, మన దేశములో వారికిన్ని వ్యత్యాసముకలదు అక్కడి శ్రామికులు

పరిశ్రమలు నిర్మింపబడిన పట్టణములయందే నివాస మేర్పరుచు కొని కాపురముండిరి. మన దేశములోని శ్రామికులకు పట్టణములయందు స్థిరనివాసములు లేవు. ఏయే పట్టణములలోని యంత్రశాలలో వారు పనిచేయుచున్నారో, ఆపట్టణములలోనే స్థిరనివాసము చేసికొనుటకు దగినవసతులను కల్పించినచో వారి స్థితి బాగుపడును.

## గృ హ ని ర్మా ణ ము

శ్రామికులు యంత్రాగార ప్రాంతములయందు నివసించుటకు తగిన వసతులను యేర్పాటు చేయవలసి యున్నది. చాలాచోట్ల వారు నివసించే గృహములు నివాస యోగ్యములుగా లేవు. అనారోగ్యమునకు తావలములై యున్నవి. కావున వారికి తగిన నివాసగృహముల నేర్పరుచుట ముఖ్య కర్తవ్యము. టాటాకంపెనీవారు తమ ఇనుము,ఉక్కు కర్మాగారముల వద్ద శ్రామికులకు వాసయోగ్యములైన వసతులను కల్పించిరి.

## ఇ త ర వ స తు లు

శ్రామికులకు ఇతరవసతుల నేర్పరుచుటకై శాసనములు చేయబడెను. దినమునకు పదిగంటలకు మించి, పెద్దవారిని పనిచేయనీయరాదనియు, పిల్లలను అయిదుగంటలకు మించి పనిచేయనీయరాదనియు, వారమునకు మొత్తము పని చేయు గంటల సంఖ్య 54 గంటలకు మించరాదనియు, శెలవు దినములు, ఇతర సౌకర్యముల గూర్చియు ఈ శాసనముల యందు నిర్ణయింపబడి యుండెను.

కొన్ని రాష్ట్రములయందు స్త్రీ శ్రామికులు గర్భవతు లైనప్పుడు ప్రసవమునకు ముందు కొంతకాలమున్ను ప్రసవా నంతరమున కొంతకాలమున్ను ఉచిత వేతనము మీూద సెల వులు యేర్పాటు చేయబడెను. అంతేగాక తమపనిలోనుంటూ శ్రామికులు మరణించినను, గాయపడినను వారికి ఉచిత వేతన ముల నిచ్చుటకు అవకాశములు కల్పింపబడెను. వారిజీతములు గూర్చి కూడ కొన్ని నిబంధనలు కలవు.

## లేబరు సంఘములు

పాశ్చాత్యదేశములలో లేబరు సంఘములు యేర్పడి బాగుగా పనిచేయుచున్నవి శ్రామికులు యీా సంఘములలో సభ్యులుగాచేరి వాటిద్వారా తమయొక్క అవసరమునుగూర్చి ఆందోళనచేసి, తమ కష్టములను బాపుకొనుచున్నారు. సంఘ నాయకులు గుణవంతులగుచో, ఈ సంఘములు చక్కగా పని చేయును. లేకున్న శ్రామికులకు కష్టము కలిగించును. ఇట్టి సంఘముల నెలకొల్పుటకు ప్రభుత్వము అనుమతినొసంగవలెను. మనదేశములో కూడ యీా సంఘములను రిజిష్టరుచేసికొన వచ్చును; ఇందునిమిత్తమై 1926 సం॥ న ఒక శాసనము చేయ బడెను. ఆశాసనము చేసిన నిబంధనలకు లోబడి శ్రామికులు సంఘములను స్థాపించి, తమకోరికల నెరవేర్చుకొనుటకు ప్రయ త్నించవచ్చును.

## వివాదములు

అప్పుడప్పుడు యంత్రాగార పరిపాలకులకున్ను శ్రామికు లకున్ను వివాదములు పొసగుచుండును. ఈవివాదములవల్ల పని

మొండిపడి వస్తూత్పత్తి తగ్గిపోవును. ఇట్టివిపొసగకుండు నట్లు పరిస్థితులనుకల్పించవలసి యున్నది. శ్రామికులకు తగినసౌకర్యములను చేసి, వారి ఆరోగ్యమును కాపాడి, వారి శక్తిపాటవములను పెంపొందించి, తద్వారా యెక్కువ ఉత్పత్తినిచేసి, తమ లాభములను గూడ పెంచుకొనుటకు యత్నించుటయే పరిశ్రమాధికారుల విధియై యున్నది. తమకు పనికల్పించిన ఖామందుల యెడ విధేయతకలిగి శక్తివంచన లేక పనిచేసి, ఉత్పత్తిని పెంచుట శ్రామికుల విధియై యున్నది.

అయినను అప్పుడప్పుడు వివాదములు సంభవించక తప్పదు. అట్టి తరుణమున వివాదముల పరిష్కరించుటకు సదుపాయము లుండుట అవసరము. తృప్తికరముగానున్నను లేకున్నను మనదేశములోకూడా, యీ సదుపాయములగూర్చి కొన్ని శాసనములు కలవు.

దేశాభ్యుదయము దేశీయ పరిశ్రమాభివృద్ధియు, సంతృప్తికరమైన పారిశ్రామిక విధానముమీద ఆధారపడియుండు నని చెప్పుటకెట్టి సంశయమును లేదు; శ్రామికుల జీవితావసరములకు వలయు సౌకర్యముల నమర్చుట యనునది, యంత్రశాలాధికారులకేగాక ప్రభుత్వమునకున్ను ముఖ్యవిధియై యున్నది.

# 6 వ అధ్యాయము

## రహదారులు — వాణిజ్యము

దేశములోని వర్తకవ్యాపారములు విరివిగా సాగవలె నన్నచో రాకపోకలకు సౌకర్యము లుండవలెను. రైలు మార్గములు, రోడ్లు, నీటిమార్గములు విశేషముగా ఏదేశమున నుండునో అక్కడ వాణిజ్యము చురుకుగా సాగును. అందులో భారతదేశమువంటి విశాలదేశమున రహదారులయొక్క సౌకర్యము మిక్కిలి యవసరము. వందలు వేలు మైళ్ళదూరము గల అనేక ప్రదేశములమధ్య రాకపోకలు, వాణిజ్య సౌకర్యములు ఏర్పడవలెనన్నచో రహదారులు మిక్కిలి అవసరము. ఒక రాష్ట్రమునందు పండినధాన్యము వేఱొకరాష్ట్రమునకు పంపుట అవసరమగుచో రైలుమార్గములవంటి సౌకర్యములు లేకున్నయెడల అట్టివి సాధ్యముకాదు. అటులనే ఒకరాష్ట్రమున తయారగు వస్త్రములు వేఱొకరాష్ట్రమునకు పంపబడవలె నన్నచో రహదారీ సౌకర్యములు అత్యవసరము.

ప్రాచీన కాలమందు మనదేశము భాగ్యసంపన్నమై చక్కని రహదారులను కలిగియుండెడిదని చరిత్రవలన స్పష్ట మగుచున్నది. ఆనాటికి ప్రపంచములో నెచ్చటను రైలు మార్గములు లేవు. ఆ కారణమున మన దేశమునందుకూడ లేవు. తరువాత బ్రిటిషు పరిపాలనయందును చాలకాలము వరకును లేవు. 19 వ శతాబ్దముయొక్క రెండవభాగములో మొట్టమొదటగా రైలుమార్గములు మన దేశములో నిర్మింప

బడెను. 1941 సంవత్సరము నాటికి మన దేశములో 41052 మైళ్ళ పొడవుగల రైలుమార్గములు కలవు. షుమారు 854 కోట్ల రూపాయల పెట్టుబడి యిందుకొరకై పెట్టబడియున్నది.

## రైలు మార్గములు

మొదటలో యీ రైలుమార్గములకు కావలసిన పెట్టుబడినంతను బ్రిటను దేశములోని పెట్టుబడిదారులే పెట్టి రైలు మార్గములనిర్మించిరి. ఆపెట్టుబడి దారులు కంపెనీలుగా యేర్పడిరి. వారికి యిండియా ప్రభుత్వమువారు కొన్ని హామీల నిచ్చిరి. పెట్టుబడి మొత్తముమీద నిర్ణీతమైన వడ్డీ నిచ్చుటకు హామీపడిరి. అనగా కంపెనీవారికి నష్టమువచ్చినను ఏర్పాటు ప్రకారము తక్కువైనవడ్డిని ప్రభుత్వవారు యిచ్చుటకు ఒప్పందమైరి. కొంతకాలమును నిర్ణయించి ఆవ్యవధి అయిపోయిన తరువాత, కంపెనీలవద్దనుండి యీ రైళ్లమార్గముల కొనుట కున్ను కంపెనీ పరిపాలనలో నున్నప్పుడు తనఖీచేయు అధికారమును కలిగియుండుటకున్ను ప్రభుత్వమువారు యేర్పాటు చేసికొనిరి.

తరువాత కొంతకాలమునకు యీ పద్ధతిని మానివేసి ప్రభుత్వమువారే రైలుమార్గముల నిర్మించి తామే పరిపాలించుచుండిరి. ఇందువలన ప్రభుత్వమునకు నష్టమురాసాగెను తిరిగి యీపద్ధతినిమార్చి నూతనపద్ధతి నొకదానినవలంబించిరి.

ఈ నూతనపద్ధతి ప్రకారము కంపెనీలవారే పెట్టుబడి పెట్టి రైలుమార్గముల నిర్మించవలసియుండెను. రైలుమార్గముల యొక్క హక్కు ప్రభుత్వమునందే యుండెనుగాని కంపెనీల

యుందు లేదు. నియమిత కాలమువరకు కొన్ని షరతులకులోబడి కంపెనీవారు రైలుమార్గములను నడుపుకొనవలసి యుండెను. తమ పెట్టుబడిమీద నూటికి 3½ రూపాయలవరకు వడ్డి నిచ్చుటకు ప్రభుత్వము హామీపడెను. నియమిత కాలము పూర్తి కాగానే కంపెనీలవారికి పెట్టుబడి ధనమును యిచ్చివేసి ప్రభుత్వమే రైలుమార్గములను స్వాధీనము చేసికొనవలసి యుండెను. కంపెనీవారి యొక్క పరిపాలనమీద ప్రభుత్వమునకు అజమాయిషీ చేసేహక్కు కలదు.

నియమిత కాలము పూర్తియైనందున దాదాపుగా యిప్పటికి అన్నికంపెనీలవద్దనుండియు ప్రభుత్వమువారు రైలుమార్గములను స్వాధీనము చేసికొని యున్నారు. ఈ రైలుమార్గములు దేశీయుల రాకపోకలకు, వాణిజ్యప్రవాహమునకు ఉపయోగింపబడవలసియున్నను, బ్రిటిషువర్తకుల లాభముకొరకే వినియోగింపబడుచు వచ్చెను. రైల్వే రేట్లుగాని రైలుమార్గములుగాని విశేషముగా వారిలాభమునకే ఉపయోగించెను. రాను రాను ప్రజలకు స్వాతంత్ర్యము లభించినకొలది యీవిధమైన సౌకర్యములు బ్రిటిషువర్తకులకు తగ్గిపోయినవి. బ్రిటిషు వర్తకుల లాభమునకే యీరైలుమార్గములు ఎక్కువగా ఉపయోగింపబడినను, మన దేశీయులకు కూడా, కొంత ఉపకరించెను. కఱవు, కాటకములవల్ల బాధపడే ప్రదేశములకు ఆహార ధాన్యములను సరఫరా చేయుటకు సహాయపడెను ఇకముందు యీరైలుమార్గములవలని ప్రయోజనములను మన దేశీయులే ఎక్కువగా అనుభవించగలరు.

## రోడ్లు

రైలుమార్గములవలె రోడ్లుకూడా చాల ప్రయోజనకరములు. రాకపోకలకు, వర్తక వాణిజ్యములకు రైలుమార్గములు లేని స్థలములయందుగాని, వాటికి సహాయకారులుగా గాని రోడ్లమార్గములు అవసరమగుచున్నవి. మన దేశములోని రోడ్లయొక్క స్థితి ఎక్కువ ఉత్సాహజనకముగా లేదు. 1939సం॥ నాటికి షుమారు 285000 మైళ్ళ పొడవుగల రోడ్లు వున్నవి. అందులో షుమారు 64 వేల మైళ్ళ పొడవుగల రాతిరోడ్లున్నూ 221 వేల మైళ్ళ పొడవుగల మట్టిరోడ్లున్నూ కలవు. వీనిలో అన్నియు మంచిస్థితిలో లేవు. ముఖ్యమైనవి నాలుగు ట్రంకు రోడ్లు గలవు పెషావరు కలకత్తాలమధ్య, మద్రాసుబొంబాయిల మధ్య, బొంబాయి ఢిల్లీలమధ్య, మద్రాసు కలకత్తాలమధ్య సుమారు 5 వేలమైళ్ళ పొడవుకు మించి యేర్పడియున్నది. రోడ్డుమార్గములను మిక్కిలి అభివృద్ధిచేయవలసిన అవసరమున్నది. నీటిని అభివృద్ధిచేయుటకు యుద్ధానంతర ప్రణాళికల యందు సూచనలు కొన్ని చేయబడియున్నవి.

## నీటి మార్గములు

మనుష్యుల ప్రయాణములకు గాని సరకుల యొక్క ఎగుమతి, దిగుమతులకు గాని నీటిమార్గములు ఉపయోగించును. రైలుమార్గములు ఏర్పడక మును నీటిమార్గముల మీదనే ప్రయాణములు సరఫరాలు జరుగుచుండెను. నీటి మార్గములు రెండు విధములు (1) నదులు కాల్వలు (2) సముద్రము. సింధు, గంగ, బ్రహ్మపుత్ర, మహానది, గోదావరి,

కృష్ణ, కావేరి మొదలగు నదులమీద, పడవలు నడుపబడి సరకులను మనుష్యులను ఒకచోటి నుంచి మఱియొక చోటికి కొంపోవు చున్నవి.

మన దేశమునకు 4300 మైళ్ల పొడవుగల సముద్రతీరమున్నది. పూర్వకాలమున మన దేశపు నావలు సప్త సముద్రములయందు విహరించుచుండెడివి. నేటికవి హీనస్థితిలో నున్నవి. పరపాలనమే దీనికి ప్రధాన కారణము. విదేశ వ్యాపారమునకై తిరుగునౌకలు లేనేలేవని చెప్పవచ్చును. తీర ప్రదేశము నందలి వాణిజ్యములో మన నౌకలకు నాల్గవవంతు భాగము మాత్రమే కలదు. పెద్ద పెద్దనావలను నిర్మించే సౌకర్యములు కూడ మన దేశములో లేవు. ఇప్పుడు విశాఖ పట్టణమునందు నౌకానిర్మాణా గారము నొక దానిని ప్రభుత్వమువారు స్థాపించిరి. అది యెంతవరకు, పనిచేయ గలదో చూడవలసి యున్నది.

## విమాన మార్గములు

యుద్ధకాలమునుండివిమానయానముచాలాప్రముఖ్యము నందినది. ప్రయాణీకులేగాక, సరకులుగూడ విమానములమీద గొంపోబడుచున్నవి. భారతదేశమువంటి విశాలదేశమునకు విమానయానము అవసరము. ప్రస్తుతము ఇంగ్లాండు, అమెరికా దేశములతో విమానయానసౌకర్యము లేర్పడియున్నవి. మన దేశములోకూడ మద్రాసు బొంబాయిలమధ్య, మద్రాసు ఢిల్లీలమధ్య, ఢిల్లీ బొంబాయిలమధ్య, ఢిల్లీ కలకత్తాలమధ్య ప్రయాణీకులను గొంపోవుటకు విమానసౌకర్యములు క్రొత్తగా యేర్పాటు చేయుబడెను. విమానయాన సౌకర్యముల నేర్పాటు

చేయుటతోపాటు విమాన నిర్మాణ కర్మాగారములనుగూడ ఏర్పాటు చేయవలసియున్నది.

## వాణిజ్యము

పూర్వమున వాణిజ్యమునందు ప్రపంచ దేశములలోకెల్ల భారత దేశము తలమానికముగా నుండెను. మన దేశములో తయారైనవస్తువులు, ఖండాంతరములకు ఎగుమతి చేయబడెను. సన్నని విలువైన వస్త్రములు, దంతపు పనిముట్లు, రంగులు, సుగంధద్రవ్యములు, మొదలైనవి ఈజిప్టు, రోము, గ్రీసు, బాబిలోనియా, అరేబియా, పర్షియా, మొదలగు దేశములకు ఎగుమతిచేయబడెను. ఆ దేశములనుండి బంగారము, ఇత్తడి, సీసము, గుఱ్ఱములు మొదలగునవి దిగుమతి చేయబడెను. ఈ విధముగా వర్తకవ్యాపారములతో తులతూగుచుండెను.

15 వ శతాబ్దముయొక్క చివరభాగమున ఆఫ్రికా ఖండము చుట్టి సముద్రమార్గ మేర్పడుటవలన ఐరోపా ఖండమునకున్ను మన దేశమునకున్ను వర్తకవ్యాపారసంబంధ మేర్పడెను. ఇది ఒకవిధముగా మంచిదియే యైనను మన హానిసత్వమునకు మూలకారణమయ్యెను. ఈ మార్గమును బట్టియే బ్రిటిషు, ఫ్రెంచి, డచ్చి, పోర్చిగలు దేశములవారు మన దేశమునకువచ్చి వర్తకమును సాగించిరి. క్రమముగా బ్రిటిషువారు మిగిలినవారిని తరిమివేసి రాజ్యమును స్థాపించి మనకు ప్రభువులైరి.

సూయజు కాల్వ త్రవ్వబడిన తరువాత, ఐరోపాఖండమునకును, మన దేశమునకు మధ్యధరా సముద్రముగుండా మార్గ

మేర్పడెను. ఇందుమూలమున వర్తకము విరివిగా వ్యాపించెను. మన దేశమునుండి ఆహారపదార్థములు ముడిపదార్థములు ఎగుమతి చేయబడెను. తయారైన వస్తువులు విదేశములనుండి దిగుమతి యయ్యెను. సన్నిహిత మార్గములు ధూమనౌకలు కేబుల్సువంటి వార్తాసౌకర్యములు (కేబులు అనగా నీటిలో నుండి వార్తల నంపుటకు ఏర్పడిన తీగెలు) విదేశవర్తకము విరివిగా సాగుటకు సాధనమయ్యెను.

చాలకాలమువఱకు విదేశ వ్యాపారమంతయు బ్రిటిషు వారి అధీనములోనే యుండెను. రానురాను 20 వ శతాబ్ద మారంభమైనది మొదలు జర్మనీ జపాను అమెరికా దేశములు కూడ మన దేశముతో వ్యాపారము చేయసాగెను. మొదటి జర్మనీ యుద్ధానంతరము జపాను దేశము బ్రిటనుతో పోటీచేసి మన దేశముతోటి వ్యాపారమును బాగుగా సంపాదించెను. రెండవ జర్మనీయుద్ధముతో జపాను పడిపోయినందున అమెరికా వారు మన దేశముతోటి వ్యాపారములో గొప్ప భాగమును సంపాదించగలిగిరి.

మనవాణిజ్యమును రెండువిధములుగాభాగించవచ్చును. 1 విదేశవాణిజ్యము 2స్వదేశ వాణిజ్యము విదేశవాణిజ్యమునందు గమనింపదగిన ముఖ్యవిషయము లెవ్వియనగా (1) ముడిపదార్థములు ఆహారపదార్థములు ఎగుమతియగుట (2) తయారైన వస్తువులు దిగుమతియగుట (3) మొదటి జర్మనీయుద్ధము మొదలుకొని దిగుమతులుతగ్గి ఎగుమతులు వృద్ధియగుట (4) ఎగుమతి వస్తువులర కములు కొద్దిగానుండుట దిగుమతి వస్తువుల రకములు ఎక్కువగానుండుట (5) దిగుమతిచేసే వస్తువుల

విషయములో బ్రిటను దేశము ప్రధానస్థాన మాక్రమించుట మొత్తముమీద దిగుమతి వస్తువుల విలువకంటె ఎగుమతి వస్తువుల విలువ ఎక్కువగానుండుట.

## ఎ గు మ తి వ స్తు వు లు

జనపనార, జనపనార వస్తువులు, దూది, బట్టలు, తేయాకు, తోళ్లు, పొగాకు, పండ్లు, ఉన్ని, ఉన్నివస్తువులు, లక్క, రబ్బరు, కొబ్బరినార, సుగంధద్రవ్యములు, రంగులు ఔషధములు మొదలైనవి మన దేశమునుండి ఎగుమతి చేయబడుచున్నవి. 1940 సం॥ లెక్కలనుబట్టి ఎగుమతి వస్తువుల యొక్క విలువ షుమారు 200 కోట్ల రూపాయలు అయియున్నది.

## ది గు మ తి వ స్తు వు లు

దూది, వస్త్రములు, నూనెలు, యంత్రసామగ్రి, రంగులు, ఉన్ని, ఉన్నివస్తువులు, కాగితము, కలప, ఔషధములు, మద్యపదార్థములు, ఇనుపవస్తువులు, పట్టు, పట్టువస్త్రములు, పొగాకు, రబ్బరువస్తువులు, గ్లాసుసామగ్రి, ఎరువులు మొదలగునవి దిగుమతి చేయబడుచున్నవి. 1940 సం॥ లెక్కలను బట్టి షుమారు 160 కోట్ల రూపాయల విలువగల వస్తువులు దిగుమతి యగుచున్నవి.

విదేశ వ్యాపారరీత్యా మనకు సంబంధము కల దేశములలో ఇంగ్లాండు ముఖ్యమైన దేశము. తరువాత బ్రిటిషు కామన్‌వెల్తులోని యితర దేశములు, బర్మా సింహళము అమెరికా జర్మనీ ఫ్రాన్సు జపాను మొదలగు దేశములతో కూడ మనకు వ్యాపారము కలదు. ఈ వ్యాపారమంతయు

సముద్ర మార్గములమీదనే జరుగుచున్నది. భూమి మీదుగా ఆఫ్ఘని స్థానము పరిష్యా టిబెట్టు మొదలగు దేశములతో కూడ కొలదిగా వ్యాపారము జరుగుచున్నది.

## స్వ దే శ వా ణి జ్య ము

ఈ వాణిజ్యము రైలు మార్గములు సముద్రతీర మార్గములు రోడ్లు నదులు కాల్వలు ద్వారా సాగుచున్నది. 1940 సం॥ లెక్కలను బట్టి షుమారు 74 కోట్ల రూపాయల విలువ గల వ్యాపారము సముద్రతీరము మీదుగా సాగెను. భూభాగము ద్వారా జరిగే వ్యాపారము యొక్క మొత్తమును తెల్పుటకు సరియైన లెక్కలు లేవు గాని, రెండు మూడు వేల కోట్లవరకు ఉండునని చెప్పవచ్చును.

కలకత్తా బొంబాయి మద్రాసు కరాచీ కాన్పూరు ఢిల్లీ ఆగ్రా లాహోరు లక్నో మధుర షోలాపూరు హైదరాబాదు బెంగుళూరు అహమ్మదాబాదు మొదలగు పట్టణములు మన దేశమునందు వర్తక కేంద్ర స్థానములై యున్నవి.

మనకు సంపూర్ణ స్వాతంత్ర్యము సిద్ధించిన తరువాత వస్తువుల యొక్క ఉత్పత్తి విశేషముగా వృద్ధి చెందును. దానితో వర్తక వ్యాపారములు కూడ పెరుగును. వర్తక వ్యాపారముల యొక్క అభివృద్ధికి అవసరములైన సాధనములను పెంపొందించవలసియున్నది. అందుకై రవానా సౌకర్యములు, వార్తా సౌకర్యములు, బ్యాంకులు, ఆర్థిక విషయముల గూర్చి సమాచారముల నిచ్చు లెక్కలు అవసరము. కావున ప్రభుత్వము వారు అందుకు తగిన సదుపాయములను

కల్పించవలసి యున్నది. వీనికి తోడుగా సరియైనకరెన్సీ విధానమును, సుంకములు, వన్నులయొక్క విధానమును కూడ ప్రభుత్వము అవలంబింపవలసియున్నది.

# 7 వ అధ్యాయము



## కరెన్సీ బ్యాంకింగు

## పూర్వపు కరెన్సీ చరిత్ర

పూర్వమున భారతరాజులు పాలించుచు ఉన్నపుడు బంగారునాణెములు చలామణిలో నుండెను. మహమ్మదీయ సామ్రాజ్యకాలములో వెండినాణెములు ముఖ్యముగ అమలులో నుండెను. హిందూరాజులు బంగారమును, మహమ్మదీయరాజులు వెండిని ముఖ్యముగా అభిమానించిరి. మహమ్మదీయ రాజ్య మంతరించి బ్రిటిషువారు ఆక్రమించే లోపుగా దేశమందంతటను ఒకనాణెమనునదిలేక, అనేక రకములైన నాణెములు అమలులో నుండెను. అందులో బంగారు నాణెములున్ను వెండినాణెములున్ను కూడయుండెను. ఇట్లుండగా 1835వ సంవత్సరమునందు ఒకతులము (అనగా 180 గ్రైనులు) బరువుగల రూపాయిని చలామణిచేసిరి. అందులో 12 వంతులకు 11 వంతులు వెండియున్ను, ఒకవంతు యితరలోహములున్ను ఉండెను. అప్పటికి అమలులోనున్న బంగారునాణెములు చలామణిలోనుంచి తగ్గించబడెను.

## బంగారు ప్రమాణము

బంగారునాణెములు చలామణిలోనున్నచో ఆ కరెన్సీ విధానమును "బంగారు ప్రమాణము" అని యందురు. వెండి నాణెములు అమలులో నున్నచో "వెండిప్రమాణము" అని యందురు. 1893 సం॥ వరకు వెండి ప్రమాణమే మన దేశములో చలామణియందుండెను. ప్రభుత్వ టంకసాలకు ప్రజలు వెండిని తీసుకునివెళ్లి యథేచ్ఛగా రూపాయలలోనికి మార్చుకొనుటకు వీలుండెను. అప్పుడు వెండిధర తగ్గిపోవుటచేత వెండి ప్రమాణమును తీసివేసి బంగారుప్రమాణమును 1899 సంవత్సరమునందు ప్రభుత్వమువారు ఏర్పాటుచేసిరి. 15రూపాయల విలువగల "సవరను" లేక "సవరను" అనే బంగారునాణెము అమలు పెట్టబడెను. అది ఇంగ్లాండు దేశమున అమలులోనున్న నాణెము.

## బంగారు మారకపు ప్రమాణము

తరువాత కొంతకాలమునకు ప్రభుత్వమువారీపద్ధతిని వదలివేసి "బంగారు మారకపు ప్రమాణము"ను నెలకొల్పిరి, అందువలన తిరిగి రూపాయి అనే వెండినాణెమును అమలుపెట్టి బంగారముతో సంబంధము కలిగినట్టియు, ఇంగ్లాండు దేశమున ప్రచారములోనున్నట్టియు "పౌండు" అనే కరెన్సీతో ఒక రూపాయికి 16 పెన్నీలు మారకపు రేటుచొప్పున లంకెవేసి యేర్పాటు చేసిరి. దీనినే "బంగారుమారకపుప్రమాణ పద్ధతి" యని యందురు. ఈ పద్ధతివలన రూపాయలను పౌండులలోనికిని, పౌండులను బంగారములోనికిని మార్చుకొనుటకు

వీలున్నందున "బంగారు మారకపు పరిమాణము" అని పిలువ బడెను.

ఇంతలో మొదటి జర్మనీ యుద్ధమువచ్చెను. వెండిధర విశేషముగా పెరిగినది. అందువలన రూపాయియొక్క మారకపు రేటు క్రమక్రమముగా హెచ్చింపబడెను. 16 పెన్నీలనుండి 28 పెన్నీలవరకుకూడ హెచ్చెను. యుద్ధము ముగిసిన తరువాత యెట్టి అవసరము లేకుండగనే హెచ్చుమారకపు రేటును నిలువ బెట్టి ప్రభుత్వమువారు బ్రిటిషువారి లాభము నిమిత్తమై అక్రమ ముగా కోట్లకొలది ధనమును వెచ్చించిరి.

## మారకపు రేటు

1926 వ సం॥లో రూపాయికి 18 పెన్నీల చొప్పున మారకపు రేటు నిర్ణయింపబడెను. అనగా యింగ్లాండు దేశముతో జరిగే వ్యాపారములలో ఇంగ్లాండు ఇండియాకున్ను, ఇండియాఇంగ్లాండు కున్నూ ఇచ్చి పుచ్చుకొనుటలు జరుగుట బట్టిన్ని, ఇంగ్లాండులో పౌండులు షిల్లింగులు పెన్నీలు అనే కరెన్సీయును ఇండియాలో రూపాయలు అణాలు పైసలు అనే కరెన్సీయున్ను భిన్నము లైనవి యున్నందువల్లను రెండు కరెన్సీలమధ్య మారకము అవసరము, ఈ మారకపు రేటును ప్రభుత్వమువారు నిర్ణయించక పోయిన యెడల ఉభయ దేశముల మధ్య జరిగే వ్యాపారములనుబట్టి ఈ రేటు నిర్ణయమగును. ఈవ్యాపారము లలో ఇంగ్లాండునకు ఇండియా బాకీ పడినచో ఇంగ్లాండులోని కరెన్సీకి గిరాకి తగిలి ఆ కరెన్సీయొక్క విలువ హెచ్చును. అటులనే ఇండియాకు ఇంగ్లాండు బాకీ పడినచో, ఇండియా దేశపు కరెన్సీ విలువ హెచ్చును. ప్రభుత్వమువారు మారకపు రేటును

నిర్ణయించుట యనగా ఉభయదేశముల వ్యాపారములను బట్టి ఉభయకరెన్సీలమధ్య యెట్టిమారకపుధర నిర్ణయమైనను అట్టిధరతో నిమిత్తము లేకుండా ప్రభుత్వమువారు నిర్ణయించిన రేటు ప్రకారము తమ బొక్కసములోని డబ్బు వెచ్చించియైనను కావలసినవారికి ఉభయ కరెన్సీలను సప్లయి చేయుదురు. నేటి వరకు 18 పెన్నీల మారకపు రేటు అమలులోనున్నది. 1931సం॥ వరకు ఇంగ్లాండు దేశములో బంగారు ప్రమాణము అమలులో నున్నందు వలన 18 పెన్నీల చొప్పున రూపాయి విలువకు సరియైన బంగారమును ప్రభుత్వము నుండి సంపాదించుటకు వీలుండెడిది. తిరువాత ఇంగ్లాండు దేశము బంగారు ప్రమాణ పద్ధతిని వదిలి వేసినది అందువలన అప్పటి నుండియు రూపాయికి బంగారు మారకపు ప్రామాణ్యము పోయినది ఈ 18 పెన్నీల రేటు యొక్క నిర్ణయము వలన ప్రభుత్వము వారు మన దేశమునకు అపార నష్టమును చేకూర్చిరి.

## పేపరు కరెన్సీ

1861 సం॥ లో మొట్టమొదటగా మన దేశములో పేపరు కరెన్సీ పద్ధతి అమలులోనికి వచ్చెను. 1935 వ సం॥ లో రిజర్వు బ్యాంకు స్థాపింపబడు వరకు కరెన్సీ నోట్లను ముద్రించే అధికారము ప్రభుత్వమునకే వుండెను. కావలసిన వారికి యీ నోట్లకు బదులు అందుకు సరియైన రూపాయలను యిచ్చుటకు ప్రభుత్వమువారు బాధ్యత వహించిరి. 1935 సం॥ నుండి నోట్లు ముద్రించే యధికారమున్ను నోట్లను రూపాయలలోనికి మార్చి యిచ్చే బాధ్యతయున్ను రిజర్వు బ్యాంకునకే కలవు.

1, 2, 5, 10, 50, 100, 500, 1000, 10000, మొత్తములు గల కరెన్సీనోట్లు మన దేశములో గలవు. రూపాయి నాణెములతో బాటు యీ నోట్లున్నూ చలామణిలో నున్నవి. వీటితోపాటు లోహములతో చేయబడిన చిల్లర నాణెములున్నూ కలవు. ఇప్పటికి షుమారు 200 కోట్ల రూపాయలకు పైగా లోహపు నాణెములున్నూ 1250 కోట్ల రూపాయలకు పైగా కరెన్సీ నోట్లున్నూ చలామణిలో నున్నవి.

## బ్యాంకింగు

మన దేశములో ఆరువిధములైన బ్యాంకులుగలవు (1) రిజర్వు బ్యాంకు (2) ఇంపీరియల్ బ్యాంకు (3) మారకపు బ్యాంకులు (4) జాయింటు స్టాక్ బ్యాంకులు (5) కోఆపరేటివ్ బ్యాంకులు (6) వ్యక్తులైన బ్యాంకర్లులేక షాహుకారులు. పూర్వకాలము నుండియు మనదేశములో బ్యాంకింగు పద్ధతి యున్నది. ఇతరుల వద్దనుండి తక్కువ వడ్డికి సొమ్ముపుచ్చుకుని లోకులకు ఎక్కువ వడ్డికి అప్పులిచ్చుటయే బ్యాంకింగు యొక్క ప్రధానలక్షణము. ఈవిధముగ అప్పులిచ్చే షాహుకార్లు నేటికిని మనదేశమున గలరు. వ్యాపారమునకు బ్యాంకింగు ముఖ్యసాధనము. డబ్బులేనిదే వ్యాపారముసాగదు. వ్యవహారమునకు అవసరమైన డబ్బును సప్లయి చేయుటయే బ్యాంకింగు యొక్క ముఖ్యోద్దేశము,

## ఇంపీరియల్ బ్యాంకు

19 వ శతాబ్దముయొక్క మొదటి భాగములో మద్రాసు బొంబాయి కలకత్తా నగరములయందు మూడు

రాజధానీబ్యాంకులు ఏర్పడెను. 1921 సం॥లో యీమూడున్ను కలిసి "ఇంపీరియల్ బ్యాంకు" అనే పేరుతో ఒకే బ్యాంకుగా మారిపోయెను. ఈబ్యాంకుయొక్క పెట్టుబడిధనము విశేషముగా విదేశీయులకు చెందియున్నది. ఇది చాలపెద్ద బ్యాంకు. దేశమందతంటనల్లుకొని 160 బ్రాంచీలు కలిగి పెద్ద వ్యాపారమును చేయుచున్నది.

## రిజర్వు బ్యాంకు

ఇది 1935 సం॥ లో స్థాపించబడినది. దీనిపై ప్రభుత్వము వారికి పెత్తనము కలదు. కొన్ని విషయములలో ప్రభుత్వ పక్షమున వ్యవహరించును. ఇతరబ్యాంకులకు లేనట్టి కరెన్సీ నోట్లు జారీచేసే అధికారము దీనికి కలదు. ఇది ఆన్నిబ్యాంకులకు కూడలి వంటిది. దీనిలో అంగములుగాచేరిన బ్యాంకులకు పరపతి విశేషముగా నుండును. దీనిలోని పెట్టుబడి ధనము చాల మటుకు వాటాదారులకు చెందియున్నది. ఇది చాలా గొప్ప సంస్థ. అంగములుగా చేరిన బ్యాంకులమీాద దీనికి పెత్తనము కలదు.

## మారకపు బ్యాంకులు

ఈ బ్యాంకులు విదేశవ్యాపారమునకు కావలసిన ఇతర దేశములయొక్క కరెన్సీలను సప్లయిచేయును. ఇంగ్లాండు దేశమునుండి సరకులను తెప్పించిన వర్తకులు అక్కడ చెలామణిలో నున్న పౌండులను సంపాదించి ఇంగ్లాండు వర్తకులకు పంపవలసి యుండును. తనవద్దనున్న రూపాయిలనిచ్చి పౌండులను మార్చుకొనవలయును. ఈ మారకము సప్లయిచేసే బ్యాంకులే మారకపు బ్యాంకులు. అట్టి బ్యాంకులు మన దేశ

ములో 18 కలవు. ఇందులోని పెట్టుబడులున్ను, లాభములున్ను విదేశీయులవే.

## జాయింటు స్టాకు బ్యాంకులు

వాటాలమేరకు పరిమితమైన బాధ్యత గలిగి, వాటాదారుల యొక్క పెట్టుబడిధనముతో స్థాపింపబడి, బ్యాంకింగు వ్యాపారములను చేసే సంస్థలకు జాయింటు స్టాక్ బ్యాంకు లనిపేరు. ఇండియాబ్యాంకు, సెంట్రలుబ్యాంకు, ఆంధ్రాబ్యాంకు మొదలైనవి యిందుకు నిదర్శనములు. సామాన్యముగా యీ బ్యాంకులు వర్తకులకు అప్పులు యిచ్చును. వీటివద్ద అప్పుతెచ్చుకుని వర్తకులు విరివిగా వ్యాపారము చేయగలుగు చున్నారు. ఈ బ్యాంకులలో చాలాభాగము రిజర్వుబ్యాంకునకు అంగములుగా నేర్పడినవి. అత్యవసర కాలములయందు వీటికి రిజర్వుబ్యాంకుయొక్క సాహాయ్యము లభించగలదు.

## కోఆపరేటివ్ బ్యాంకులు

ఈ బ్యాంకులు ఈ శతాబ్దముయొక్క ప్రారంభములో మనదేశమునందు స్థాపించబడినవి. ఈ బ్యాంకులు సహకార పద్ధతిమీద ఏర్పడినవి. అందులో సభ్యులైన వారికే అవకాశము లభించును. వీనిలో భూమితనఖా బ్యాంకు లనునవి కలవు. మామూలుగా బ్యాంకులు దీర్ఘవాయిదాలమీద అప్పులనివ్వవు. సామాన్యముగా ఋణమును తీర్చేగడువు ఒక సంవత్సరమునకు మించియుండదు. మనదేశము వ్యావసాయికదేశమగుటచేత అప్పు పుచ్చుకొన్న రయితులు ఋణములును వెంటనే తీర్మానింపజాలకున్నారు. వారియొక్క సౌకర్యము నిమి

త్త్వము వారియొక్క భూములను తనఖాయుంచుకుని 10, లేక 20 సంవత్సరముల వాయిదాలమీద రయితులకు యీ బ్యాంకులు అప్పులు నిచ్చును. ఇట్టివి మన దేశమునకు చాల యవసరము.

## వ్యక్తులైన బ్యాంకర్లు

బ్యాంకుల వద్దనుండి అప్పులు పుచ్చుకొనుట అందరికి అలవాటు లేదు. అజ్ఞానము వలనను, అభిమానము వలనను వెంటనే ఋణమును షరతులప్రకారము తీర్చగలిగిన శక్తి లేనందువలనను మన దేశములో షాహుకారులవద్దనే చాలమంది అప్పు పుచ్చుకొనుచున్నారు. షాహుకార్లు హెచ్చు వడ్డీలకు అప్పులిచ్చు చున్నారు. వడ్డీలు తీర్చలేక, రయితులు చితికిపోయి తమభూములను షాహుకార్లకు అమ్ముకొనుచున్నారు. ఈ మధ్య కాలములో హెచ్చువడ్డీలను నిషేధించుచు, కొన్ని శాసనములు చేయబడెను.

ఇంతియేగాక, రయితులకు, వ్యవసాయికులకు, ప్రభుత్వము వారు ఋణముల నిచ్చునట్లు కొన్ని శాసనములు చేయబడి యున్నవి. అనుభవమును బట్టి వీనివలన రయితులకు ప్రయోజనము లభించుటలేదు. ఇదికాక, మధ్యతరగతి ప్రజలు తాము కూడబెట్టుకొన్న కొద్దిసొమ్మును దాచుకొనుటకును అవసరమైనప్పుడు తీసికొనుటకును సేవింగ్సు బ్యాంకులు స్థాపింపబడి యున్నవి.

# 8 వ అధ్యాయము



## ప్రభుత్వ ఆదాయ వ్యయములు

మొదటి జర్మనీ యుద్ధమునకు పూర్వము మన దేశములో ప్రభుత్వమునకు ఆదాయ వ్యయ పట్టిక ఒక్కటియే యుండెడిది. కేంద్ర ప్రభుత్వమునకే పన్నుల విధించే అధికారము ఉండెను. రాష్ట్రములకట్టి యధికారము లేదు. 1920సం॥ నుండి ప్రభుత్వాదాయము రాష్ట్రాదాయము కేంద్రాదాయము అని విభజింపబడెను. ఎగుమతి దిగుమతిసుంకములు, ఆదాయపు పన్ను, ఉప్పుపన్ను మొదలైన పన్నులవలన కేంద్ర ప్రభుత్వమునకు ఆదాయములభించెను. భూమిపన్ను, మద్య పదార్థములమీద పన్ను, కోర్టుఫీజు, రిజిష్ట్రేషన్‌ఫీజులు, అమ్మకపుపన్ను మొదలైన వాని మీద ఆదాయము రాష్ట్ర ప్రభుత్వములకు వచ్చెను. పోష్టు, టెలిగ్రాపు రైలుమార్గములు, కరెన్సీ మొదలైన వాని వలన కూడ కేంద్ర ప్రభుత్వమునకు రాబడి వచ్చుచున్నది. 1946 సం॥ పు లెక్కలనుబట్టి కేంద్ర ప్రభుత్వమునకు ఎగుమతి దిగుమతి సుంకములమీద సుమారు 55 కోట్ల రూపాయల ఆదాయమువచ్చెను. 1942 సం॥ పు లెక్కలను బట్టి ఆదాయపు పన్నువలన 22 కోట్ల రూపాయలు ఆదాయమువచ్చెను. ఉప్పు పన్నువలన సంవత్సరమునకు 8 కోట్ల రూపాయల ఆదాయము వచ్చుచున్నది. రాష్ట్ర కేంద్ర ప్రభుత్వములకు ఏ యే పన్ను వలన ఎంతెంత ఆదాయము వచ్చునో గ్రంథ విస్తరభీతిచే ఇచట నుదాహరించ లేదు. ఉదాహరణమునకు 1946 సం॥ లోని

మద్రాసు రాష్ట్రపు ఆదాయముతాలూకు కొన్ని లెక్కలను మాత్రము చూపించెదను. భూమి పన్ను వలన 8 కోట్లును మద్యవస్తువుల పన్ను వలన 8 కోట్లును అమ్మకపు పన్ను వలన 4 కోట్లును మిలిగినఅన్నింటివలన 10 కోట్లునుగలసి 30 కోట్లు ఆదాయమువచ్చెను.

## ప్రభుత్వ వ్యయము

ఈ శతాబ్దము మొదటికిన్ని ఇప్పటికిన్ని పోల్చి చూచినచో కేంద్రరాష్ట్ర ప్రభుత్వముల యొక్క వ్యయము మిక్కిలి పెరిగినది. మొట్టమొదటలో కేవలము శాంతి భద్రతలను నెలకొల్పి ప్రజలను సంరక్షించుటయే ప్రధాన కర్తవ్యముగా ప్రభుత్వముచే భావింపబడెను. రాను రాను ప్రభుత్వమునందు ప్రజలకు భాగము లభించుటవలన ప్రభుత్వము ప్రజోపయోగకరములైన కార్యములను నిర్వహింపవలసి వచ్చెను. విద్యాభివృద్ధి, మార్గసౌకర్యము, వైద్యసహాయము, ఆసుపత్రుల నిర్మాణము, జలాశయములు, అనకట్టలు, కాల్వలు, విద్యుచ్ఛక్తి మొదలైన వానిని నిర్మించుట మొదలైన కార్యములకు విశేషముగ ధనము వెచ్చించవలసి వచ్చెను. ఇట్టి పనుల నిర్వహించుటకు ఆదాయము ఎక్కువ కావలసి వచ్చెను. ఆదాయము హెచ్చుటకు పన్నులను హెచ్చించవలసి వచ్చెను. ఇంతలో యుద్ధము సంభవించెను. దీనివలన పన్నుల భారము మఱింత అధికమయ్యెను. మనదేశము కడు బీదదేశము. హెచ్చు పన్నులను భరింప జాలదు. హెచ్చు పన్నులు లేని దే ఆదాయ మెక్కుడుగ రాదు. ఆదాయము పెరిగిననే కాని ప్రభుత్వము ప్రజోపయోగకరము లైన కార్యములను నిర్వ

హించ జాలదు. ఇది యంతయు పెద్ద సమస్య. ఈ సమస్యను మన నాయకులు పరిష్కరింప వలసి యున్నది.

## పన్నుల విధానము

భరించ గలిగి నమటుకే భారమును వేయుట తేలికగా వసూలు చేయుట ఒకనిర్ధారణ కలిగియుండుట మొదలైనవి సక్రమమైన పన్నుల విధానమునకు లక్షణములు. పన్నులవిధానమువలన దేశము మొత్తముమీద ప్రజలయొక్క ఆదాయము అభివృద్ధియై, అందువలన ప్రభుత్వమునకు ఎక్కువ ఆదాయము రావలెను. భాగ్యవంతుల మీద హెచ్చుభారమున్ను, పేదవారి మీద తక్కువభారమున్ను ఉండునట్లుగా పన్నులు విధింపబడ వలెను. అట్టి శాస్త్రీయమైన విధానము ప్రస్తుతము మన దేశములో లేదు. స్వరాజ్య ప్రభుత్వము పన్నులవిధానమును సవరించవలసియున్నది.

## ప్రభుత్వ ఋణములు

పన్నులమూలమున వచ్చేరాబడికాకుండా ప్రభుత్వము వారు ప్రజలవద్దనుండి ఋణములను తీసికొందురు. అవసరమైన పనులకు ఆ మొత్తమును వినియోగించెదరు. 1945 సం॥ నకు భారత ప్రభుత్వము చేసిన ఋణము షుమారు 1820 కోట్ల రూపాయలు అయి వున్నది. ఇండియాలో కొంతఋణమున్ను, ఇంగ్లాండులో కొంతఋణమున్ను చేయబడినది. షుమారు 3½ కోట్ల రూపాయల విలువ గల ఋణము మాత్రము ఇంగ్లాండులో చేయబడినది ఉన్నది. మిగిలిన ఋణమంతయు, మన దేశములోనే చేయబడినది. ఇంగ్లాండులో చేసిన ఋణమును

స్టర్లింగు ఋణమనియు, ఇండియాలో చేసినఋణమునురూపాయ ఋణమనియు చెప్పుదురు. ఇంగ్లాండులో ఇండియా ప్రభుత్వమువారు చేసిన ఖర్చులకొరకై స్టర్లింగు ఋణము చేయబడినది. రెండవ జర్మనీ యుద్ధమునకు పూర్వము ఈ స్టర్లింగు ఋణము 500 కోట్ల రూపాయల విలువకు మించి యుండెను. స్టర్లింగు ఋణమనగా పౌండులను అప్పుతీసికొని తిరిగి పౌండులలోనే యివ్వవలయును. గడచిన యుద్ధమునందు ఇంగ్లాండు దేశము అనేక వస్తువులను మనదేశమునుండి కొనుట వలన లోగడ ఇంగ్లాండు దేశమునకు బాకీయున్న స్టర్లింగు ఋణము యావత్తున్ను దాదాపుగా తీరిపోయినది. కాబట్టి యిప్పటికి ఇండియాప్రభుత్వము ఇండియాలో నున్న వారికే రూపాయలలో ఋణమును తీర్చవలసియున్నదేగాని విదేశములవారికి ఋణములు తీర్చవలసిన అగత్యము లేదు. అప్పుపెట్టినవారికి, ప్రభుత్వమువారు పత్రముల వ్రాసియిచ్చెదరు. ఆ పత్రములబట్టి వడ్డీరేటు ఏర్పడియుండును. పత్రపుషరతుల ప్రకారమువడ్డీయున్ను అసలున్ను తిరిగి యిచ్చివేయబడును,

భారత ప్రభుత్వమువారు చేసే ఋణము లేగాక రాష్ట్ర ప్రభుత్వములు కూడా ఋణములు చేయుటకు 1935 సం॥ పు ఇండియా చట్టమునుబట్టి అధికారముగలదు. ఆ యధికారమును పురస్కరించుకొని రాష్ట్ర ప్రభుత్వములు కూడా 1937 సం॥ నుండి ఋణములుచేసి యున్నవి.

ఈ ఋణములు రెండు విధములుగా విభజింప బడినవి. (1) లాభదాయకములు (2) లాభదాయకములు కానివి. రైలు మార్గములు, ఆనకట్టలు, జలాశయములు, విద్యుచ్ఛక్తినంస్థలు

మొదలగు వానిని స్థాపించుటకు ప్రభుత్వము ఋణము చేసినచో అట్టి ఋణములు లాభదాయక ఋణములు అని చెప్పబడును. ఈ డబ్బువలన నిర్మింపబడిన సంస్థల మూలమున ప్రభుత్వమునకు ఆదాయము వచ్చునుగాన అవి లాభ దాయకములు. యుద్ధముచేయుటకు ఋణములను సేకరించినచో ఆమొత్తమంతయు విధ్వంసక కార్యములకు వినియోగింప బడునేకాని ఆదాయమును సంపాదించగల కార్యములు కానందున అవి లాభదాయకములు కావు. ఏయే ఋణములనుఎప్పుడెప్పుడు యేయే విధముగా చేయవలయునో ప్రభుత్వము నిర్ణయించును. ఈ ఋణ విధానము మీాద దేశముయొక్క ఆర్థికసంపద కొంతవరకు ఆధారపడి యుండునుగాన శాస్త్రీయపద్ధతులను మంచి అనుభవ జ్ఞానమును పురస్కరించుకొని యీా ఋణములను చేయవలసి యున్నది.

# 9 వ అధ్యాయము

## ఇతర విషయములు

### దేశీయాదాయము

ఏ దేశము యొక్క సౌభాగ్యమైనను ముఖ్యముగా ఆ దేశమునకు వచ్చే దేశీయాదాయమును బట్టి, నిర్ధారణ చేయ బడును. మన భారత దేశము కడు బీద దేశమని చెప్పుటలో ఎట్టి సంశయమున్ను లేదు. మన దేశమున గొప్ప ఇంజనీయరు అని పేరు వడసిన సర్, యం, విశ్వేశ్వరయ్య గారు 1923

సంవత్సరమున వేసిన అంచనాలను బట్టి సగటు ఆదాయము మనిషి 1కి సాలునకు రు 85-0-0 లు అని తేలినది. ఆర్థిక శాస్త్ర ప్రవీణుడగు వి. కే. ఆర్. వి. రావుగారు 1932 సం॥ లో వేసిన అంచనాలను బట్టి మనిషి 1కి సాలునకు సగటు ఆదాయము రు. 65-0-0 లు అయియున్నది. ప్రస్తుతము వస్తువుల ధరలు పెరిగి నందువలన సగటు ఆదాయము కొంచెము పెరిగి యుండవచ్చును. యుద్ధమునకు పూర్వము జపాను దేశములో సగటు ఆదాయము రు 271 లున్ను జర్మనీలో రు 634 లున్ను ఫ్రాన్సులో రు 636 లున్ను ఇంగ్లండులో రు. 1092 లున్ను అమెరికాలో రు. 2053 లున్ను అని తెలియువచ్చు చున్నది. ఇతర దేశములతో పోల్చినచో మన దేశీయాదాయము చాల తక్కువగా నున్నది. ఇందుకు కారణములు పెక్కులున్నవి. కాని ముఖ్య కారణము రాజకీయమైన బానిసత్వమే.

మన దేశములో నున్న కొంచెము సంపదయైనను జన సామాన్యమునకు చెందియుండ లేదు. మొత్తము సంపదలో 3 వ వంతు భాగమును నూటికి 5 గురు ధనవంతులు అనుభవించు చున్నారు. నూటికి 35 వంతుల సంపదను షుమారు మూడువ వంతు ప్రజలు అనుభవించు చున్నారు. నూటికి 30 వంతుల సంపదను మిగిలిన 60 మంది అనుభవించు చున్నారు.

## నిరుద్యోగము

మన దేశము దారిద్ర్యమునందు మునిగి యున్నందు వలనను అజ్ఞానాంధకారముచే ఆవరింపబడి యున్నందువలనను

అనేకమంది ప్రజలు వృత్తులు లేక బాధపడుచున్నారు. ఇతర దేశములలోవలె నిరుద్యోగులు ఎందరు మన దేశములో నున్నారో చెప్పుటకు లెక్కలు లేవు. కోట్లకు మీరి యుందురని చెప్పుటలో అతిశయోక్తి యుండజాలదు. కొందరికి అసలే జీవనోపాధులు లేవు. మరికొందరికి సంవత్సరములో కొంతకాలము జీవనోపాధులు ఉండుట మఱి కొంతకాలము లేకుండుట సంభవించుచున్నది. ఇంకా కొందఱికి ప్రతిదినము పని యున్నను చాలినంత పని లేకున్నది. ఆర్థికముగా ఒక దేశము సుభిక్షముగా నున్నదని చెప్పవలయునన్నచో అక్కడి ప్రజలయొక్క జీవిత ప్రమాణము సరిగా నుండి నిరుద్యోగులు లేకుండా ఉండవలెను. ఆనాడే దేశము సుఖవంతముగానున్నదని చెప్పదగును. మన దేశములో విద్యావంతులలోను విద్యలేనివారిలోను కూడా నిరుద్యోగసమస్య ప్రబలి యున్నది. దేశములో అన్నిరకములైన పరిశ్రమలను అభివృద్ధి చేసిననేగాని యీసమస్య పరిష్కారము కాజాలదు. కేవలము భారీపరిశ్రమలవల్ల యీ సమస్య పరిష్కారము కాదు. వికేంద్రీకరణ సిద్ధాంతము ననుసరించి గృహపరిశ్రమలకు తగు ప్రోత్సాహ మొసంగుచో ఆనాడు నిరుద్యోగపిశాచము అంతరించి దేశము సౌఖ్యవంతము కాగలదు. స్వరాజ్యప్రాప్తి యైనతోడనే మన నాయకులు దేశీయాభివృద్ధికి పూనుకొని పరిశ్రమల నెలకొల్పి ఈశ్వరసాహాయ్యము చేత యీ నిరుద్యోగ భూతమును పారద్రోలుదురు గాక.

సంపూర్ణము.



# పారిభాషిక పదముల అనువాదము.

Science of Economics = అర్థశాస్త్రము
Wealth = అర్థము
Production = ఉత్పత్తి
Consumption = వినియోగము
Exchange = వినిమయము
Distribution = విభాగము
Physical features = నైసర్గిక స్వరూపము
Population = ప్రజలు
Land tenures = భూమి విధానము
Industries = పరిశ్రమలు
Communications = రహదారులు
Trade = వాణిజ్యము
Public finance = ప్రభుత్వాదాయవ్యయములు
Harbour = నౌకాశ్రయము
North-East-monsoon = ఈశాన్యఋతుపవనము
South-West-monsoon = నైఋతి ఋతుపవనము
Soils = భూసారములు
Alluvial soil = రేవడభూమి
Black cotton soil = నల్లభూమి
Crystaline soil = గడ్డభూమి
Minerals = ఖనిజములు
Permanent Settlement = శాశ్వతపు టొడంబడిక పద్ధతి
Temporary Settlement = తాత్కాలపు టొడంబడిక పద్ధతి
Tariff Board = రక్షణ సంఘము
Discriminate Production = పరిశీలన రక్షణ
Labour = శ్రామికులు
Trade Union = శ్రామికసంఘము
Gold-standard = బంగారు ప్రమాణము
Silver-standard = వెండిప్రమాణము
Gold exchange standard = బంగారు మారకపుప్రమాణము
National income = దేశీయాదాయము
Standard of living = జీవితప్రమాణము
Unemployment = నిరుద్యోగము

వ ల యు వా రు :—

కాశీనాధుని పూర్ణ మల్లికార్జునుడు,

బు ట్ట య పే ట, బ ం ద రు.

# అమృతాంజనం
## ఆరోగ్యభాగ్యానికి జెండా

పల్లవి

ఆరోగ్యభాగ్య మిదె కొనరా. సదమల — నీరపౌరుష నవ్యుషస్థా
అమృతాంజనముశక్తి కనరా, నీదు — ఆదివ్యాధుల మాన్పుకొనరా

చరణాలు

1

తలనొప్పి, కనునొప్పి-కీళ్ల కాళ్లనొప్పి, అనిమూల్గుతూ పండు కొనుటకేలకోకా
సాధించవలసిన-పనులు పెక్కులుకలవు, ఆరోగ్యమును తొలుత-సరిచేసుకొనవలె
నీవు ॥ఆరో

2

పండ్లుపంటలు లెన్న-పండించుకొనుటకు, ఫ్యాక్టరీలను చక్క-గా పనులుచేయుటకు
ఆఫీసుపనుల నతి-చురుకుగా జరుపుటకు, ఒడ్లు బాధయు లేని-నొప్పి గొప్పులు రాని
ఆరోగ్యమే మూల-ధనముగా నెంచుకొని, ఆదరించిన నీకు-అనవరతి జయముగున

3

ఫ్యాక్టరీలను నలిగి-పనిచేయుటం గలుగు, కీళ్లనొప్పుల కివి-కీలకంబగు మందు
ఆఫీసువర్కుతో-అలసిపోయేవారి తలనొప్పులకు ఇద్ది-తులలేనిమందుగద ॥ఆరో.

4

ఉష్ణాధిక్యంబుచే కలుగు తలతిరుగుడుకు వర్షాదికంబుచే-వచ్చెడి రొంపలకు
శీతకాలప్పుకఫము-లడగ్గుంటకు ఇదే, ఖ్యాతిపొందిసనిరా-రణసాధనంబోయి ॥ఆరో

5

మర్దనంబున గుణము-వర్ధిల్లు ననుసూక్తి, సార్థకంబయె దీని-చరితలో చూడగా
పైనరాచిన మాత్ర-లోన మార్పునకూర్చు, గుణము దీనదె కుదురు-కొనియున్నది
కదోయి ॥ఆరో॥

6

అమృతాంజనము మాన-వారోగ్యముకుధ్వజము, అన్నినొప్పులను దును-మాడ
సామజమ
కార్యతత్పరత కా-స్థానమగు నీరజము. దానిపొగడగ బ్రహ్మ-కైనాను అగ్గణ

గరిమెళ్ల సత్యనారాయణ B. A.

A. G. Press, Bza· K9- 1000-5-3-47·